# చైర్మన్‌తో ముఖాముఖి





నూకారపు సూర్యప్రకాశరావు
చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక

**ప్ర: ఇంధనం, నీటివనరుల కొరత తీవ్రస్థాయిలో ఉన్నాయి. రోజురోజుకూ సహజవనరులు తరిగిపోతున్నాయి. జనాభా మాత్రం రెట్టింపవుతోంది. రాబోయే తరం ఊహించుకుంటేనే భయం వేస్తోంది. సౌరవిద్యుత్ పట్ల ఇంకా ప్రజలలో పూర్తి స్థాయి అవగాహన లేదు. పవన విద్యుత్ వలన కలిగే ఉపయోగాలు కూడా జనాలకు తెలియదు. జనాలకు అర్థం అయ్యేలా అవగాహన కల్పిస్తే బాగుంటుంది?**

**– ఎన్.పార్వతి, హైదరాబాద్**

జ: సౌరవిద్యుత్ ఉత్పాదనవల్ల అనేక సౌలభ్యాలు ఉన్నాయి. సౌరశక్తి పుష్కలం... అనంతం. కాబట్టి, ఎక్కువ తక్కువ వంటి వినియోగ సమస్యలు ఎదురు కావు. వాడుకున్నవారికి వాడుకున్నంత. ప్రస్తుతం దేశంలో 65 శాతం విద్యుత్తు శిలాజ ఇంధనాల ద్వారానే ఉత్పత్తి అవుతోంది. ఈ పరిస్థితి ఇకముందూ కొనసాగే అవకాశముంది. భవిష్యత్తులో శిలాజ ఇంధనాలు తరిగిపోతే విద్యుత్ కష్టాలు అనివార్యమవుతాయి. అందువల్ల విద్యుత్ సుస్థిరతకు పునరుత్పాదక ఇంధన వనరుల వినియోగం తప్పనిసరి. అందుకు పవన, సౌర విద్యుత్తులే ఇప్పుడున్న ప్రత్యామ్నాయాలు. పవన విద్యుత్తులో ప్రపంచంలో మనదేశం అయిదో స్థానంలో ఉంది. సుమారు 23 వేల మెగావాట్ల పవన విద్యుత్ స్థాపక సామర్థ్యం దేశంలో ఉంది. అలాగే 750 గిగావాట్ల సౌర విద్యుత్ ఉత్పాదనకు అవకాశం ఉందన్నది అంచనా. సూర్యకిరణాల వేడి కారణంగా ఆరుబయట ఆరేసిన తడి వస్త్రాలు పొడి అవుతాయి. అలాగే, సౌరఫలకాలు సౌరశక్తిని పీల్చుకుని విద్యుత్తును ఉత్పత్తి చేస్తాయి. వేడి నీటి కోసం సౌరశక్తి వాటర్ హీటర్స్ గురించి మనకు తెలిసిందే. కర్బన ఉద్గారాలతో పర్యావరణనికి ఏర్పడుతున్న ముప్పు నేపథ్యంలో పునరుత్పాదక ఇంధన వనరులను వినియోగించుకోవడంపై ఇప్పుడు అందరి దృష్టి పడింది. 2008 జూన్‌లోనే నాటి ప్రధాని మన్మోహన్ సింగ్ వాతావరణ మార్పులను దృష్టిలో పెట్టుకుని జాతీయ కార్యాచరణ ప్రణళికను ఆవిష్కరించారు. అందులో తొలి ప్రాధాన్యం సౌర విద్యుత్ ఉత్పాదనకు ఇచ్చారు. జవహర్‌లాల్ నెహ్రూ జాతీయ సౌర విద్యుత్ మిషన్‌ను ఏర్పాటు చేశారు. కాకపోతే, అప్పటి 20 వేల మెగావాట్ల లక్ష్యం ఇప్పుడు లక్ష మెగావాట్లు అయింది.

జ: సర్కారియా కమిషన్ సిఫార్సులను ఖాతరు చేయకుండా ట్రైబ్యునల్ ఏర్పాటులో కేంద్రప్రభుత్వ జాప్యం, తీర్పు ఇవ్వడంలో ఆలస్యం సర్వసాధారణమైపోయాయి.

సభ్య రాష్ట్రాలకు ట్రైబ్యునల్ కేటాయించిన కృష్ణా జలాల విడుదల, వినియోగాన్ని నియంత్రించి, క్రమబద్ధీకరించడానికి ట్రైబ్యునల్-2 ఒక అంతర్రాష్ట్ర సంస్థను ఏర్పాటు చేసింది. అలా ఒక నియంత్రణ సంస్థను ఏర్పాటుచేసే అధికారం 1956నాటి చట్టంలోని విభాగం-6 ప్రకారం కేంద్రప్రభుత్వానికి ఉంటుందేకాని, ట్రైబ్యునల్‌కి ఉండదని రాష్ట్రాలు అభ్యంతరం తెలియజేశాయి. అదీగాక, అవసరమైన సిబ్బంది, విధులతోపాటు నేరాలకు శిక్ష విధించే అధికారాన్ని కట్టబెట్టినప్పుడే కృష్ణా జలాల విభజన అమలు బోర్డు సమర్థంగా పనిచేయగలుగుతుంది. ప్రస్తుతం అటువంటి అధికారాలు, అవసరమైన సిబ్బంది లేనందువల్ల ఆ బోర్డు సమర్థంగా తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించలేకపోతోంది. ట్రైబ్యునళ్ల తీర్పులు అమలులోకి రావాలంటే కేంద్రసర్కారు చొరవ ఎంతో కీలకం. నదీజలాల వివాదాలకు సంబంధించిన సర్కారియా కమిషన్ సిఫార్సులను కేంద్రం కట్టుదిట్టంగా అమలుపరచాలి. నిర్ణీత కాలంలో ట్రైబ్యునళ్లు తీర్పులు ఇచ్చేలా చేసి, వాటిని కార్యాచరణ దిశగా నడిపించాలి. కృష్ణాజలాల విభజన అమలుకు సంస్థను చట్టం ప్రకారం కేంద్రప్రభుత్వం నియమించి, దానికి అవసరమైన సిబ్బందిని, నిధులను, నేరాలకు తగిన శిక్షలను విధించే అధికారాలను సమకూర్చి, ఆ సంస్థను బలోపేతం చేయాలి. ప్రస్తుతం ట్రైబ్యునళ్ల పరిశీలనలు, విచారణలు సుప్రీంకోర్టులో వాద, ప్రతివాదాలు ఒక వారం జరిగితే మూడు, నాలుగు నెలలు వాయిదాపడి, తీరిగ్గా జరుగుతున్నాయి. దీనివల్ల నదీజల వివాదాలు ఎన్నేళ్లు గడచినా ముడివడక కొనసాగుతూనే ఉన్నాయి. ఈ వివాదాల పరిష్కారం ఆలస్యమైనకొద్దీ రాష్ట్రాల మధ్య స్పర్థలు రగులుతూనే ఉంటాయి. న్యాయ నిర్ణయంలోని జాప్యం, న్యాయ నిరాకరణతో సమానమన్నది న్యాయశాస్త్రంలోని ముఖ్యసూత్రం. కాబట్టి, సుప్రీంకోర్టు, కేంద్రప్రభుత్వం, ట్రైబ్యునళ్లు ఈ న్యాయసూత్రాన్ని పాటించి, నదీజల వివాదాలను సాధ్యమైనంత త్వరలో పరిష్కరించినప్పుడే రాష్ట్రాల మధ్య సామరస్యం, సుహృద్భావం ఏర్పడి, దేశం ప్రగతిపథంలో పయనిస్తుంది.

**ప్ర: నోట్ల రద్దుతో ముందు ముందు ప్రయోజనాలు ఎన్ని ఉన్నా...ప్రస్తుతం మాత్రం ఎక్కువగా అతివలు కష్టాలపాలవుతున్నారు. ఢిల్లీ పెద్దలకు ఇవన్నీ చిన్న విషయాలు...దానికి తోడు చంద్రబాబులాంటి బాధ్యతాయుత నేతలు కూడా పెద్ద నోట్లను తానే రద్దుచేయించినట్లు గొప్పగా చెప్పుకుంటున్నారు...నగదు రహిత లావాదేవీలకు రమ్మని చాలా ఈజీగా సూచనలు ఇస్తున్నారు...ఇవన్నీ అమలులో సాధ్యమయ్యేవేనా?**

**–ఎన్.గోపీకిషన్, సురారం**

జ: బాధ్యతాయుతమైన స్థానాల్లో ఉండే పెద్దలు ఆచి తూచి మాట్లాడాలంటారు. లేకపోతే అభాసుపాలవుతారు. మోడీ ప్రభుత్వం పెద్ద నోట్లను రద్దు చేసిన వెంటనే ఏపి సిఎం చంద్రబాబు స్వాగతించారు. పెద్దనోట్లను రద్దు చేయాలని తానెప్పుడో మోడీకి లేఖ రాసినట్లు ఆయన గొప్ప కబుర్లు చెప్పారు. నోట్లరద్దుతో చంద్రబాబు అనేక సార్లు మాటలు మార్చారు. ప్రజలు ఇక్కట్లు పడుతున్నారన్నారు. రెండు వేల రూపాయల నోట్లనూ రద్దు చేయాలన్నారు. నగదును సరిగా పంపిణీ చేయడం లేదంటూ బ్యాంకు ఉద్యోగులపై మండిపడ్డారు. కరెన్సీ కష్టాలపై ప్రతిరోజూ సమీక్షలు చేస్తూ సలహాలు ఇస్తున్నారు. చివరకు ఆయన ఏమి ఏమి మాట్లాడుతున్నారో తెలియడం లేదని అధికారులు అయోమయంలో పడుతున్నారు. బ్యాంకర్లపై చంద్రబాబు చేసిన వ్యాఖ్యలపై బ్యాంకు ఉద్యోగుల సంఘాలు నిరసన వ్యక్తం చేస్తున్నాయి. కీలక పదవుల్లో ఉండేవారు ఆచితూచి మాట్లాడకుంటే అవస్థలు తప్పవు మరి.

SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

మెయిల్ అడ్రస్

# లెజెండ్




**స్త్రీ స్వాతంత్ర్యం అంతంత మాత్రంగానే ఉన్న యుగంలో, ఇంకా ఇరవైలు దాటని ఓ చక్కని బ్రిటిష్ యువతి, ఒంటరిగా ఆఫ్రికా అడవుల్లో సంచరిస్తూ, చింపాజీల ప్రవర్తన గురించి లోతుగా అధ్యయనాలు చేస్తూ, చింపాజీలకి, మనిషికి మధ్య ఉన్న పరిణామాత్మక సాన్నిహిత్యాన్ని అర్థం చేసుకుని, ఆ రంగంలో అగ్రగామి అయిన శాస్త్రవేత్తగా ఎదిగింది. ఆ యువతి పేరే జేన్ గుడాల్.**

## జేన్ గుడాల్

1934లో లండన్‌లో పుట్టిన జేన్‌కి చిన్నప్పట్నుంచి జంతువులంటే మహా ఇష్టం ఉండేది. జంతువులతో ఆడుకుం టున్నట్టు, మాట్లాడుతున్నట్టు కలలు కనేది. టార్జాన్, డాక్టర్ డూలిటిల్ (ఈ మనుషుల డాక్టరు మనుషుల కన్నా జంతువులకే ఎక్కువగా చికిత్స చేస్తూ ఉంటాడు) వంటి పిల్లల పుస్తకాలు చిన్నతనంలో ఈమెకి ఎంతో స్ఫూర్తి నిచ్చేవి. అందరిలాగానే పెళ్లి చేసుకుని లైఫ్‌లో సెటిల్ అవ్వమన కుండా తన తల్లి వాన్నే కూతుర్ని తనకి నచ్చిన దారిలోనే ముందుకి సాగమని ప్రోత్సహించేది. నీకు ఏం కావాలంటే అది అవ్వు. నువ్వు ఏ రంగాన్ని ఎంచుకున్నా అందులో బాగా పైకొస్తావని నాకు తెలుసు, అనేది ఆ తల్లి...

ఇరవై రెండేళ్ల వయసులో జేన్‌కి తన జీవితాన్ని మార్చేసే ఓ గొప్ప అవకాశం దొరికింది. ఓ లండన్ ఫిల్మ్ స్టూడియోతోపాటు ఆఫ్రికాకి వెళ్లే అవకాశం దక్కింది. అయితే ప్రయాణానికి కావలసిన ఖర్చులు కూడా తన వద్ద లేవు. వెంటనే ఓ హోటల్‌లో వెయిట్రెస్‌గా పనిలోకి దిగి, రాత్రనక పగలనక పని చేసి నాలుగు డబ్బులు వెనకేసింది. తగినంత ధనం పోగవగానే ప్రయాణా నికి సిద్ధం అయ్యింది.

ఆ ప్రయాణం 1957లో మొదలయ్యింది. ముందుగా ఆఫ్రికా లోని మొంబాసాలో దిగింది. మొంబాసాలో లూయీ లీకీ అనే పేరుమోసిన పురావస్తు శాస్త్రవేత్త ఉండేవాడు. జేన్ ఆయన్ని కలుసుకుని తన ఆశయాల గురించి విన్నవించుకుంది. జేన్ లోని ఉత్సాహం, శక్తి, జంతువుల పట్ల ఆమెకి సహజంగా ఉండే ప్రేమ మొదలైన లక్షణాలు ఆయన్ని అకట్టుకున్నాయి. వెంటనే తనకి అసిస్టెంటుగా పనిచేసే ఉద్యోగం ఇచ్చాడు. టాంజానియాలో ఓ చెరువు సమీపంలో ఉండే చింపాజీలని అధ్య యనం చేసే పనిలో ఆమెని పాల్గొనమన్నాడు. చింపాజీల జీవన రహస్యాలు అర్థమైతే మనిషి యొక్క పరిణామగతం గురించి ఎన్నో రహస్యాలు తెలుస్తాయని ఆయన ఆలోచన.

ఈ అధ్యయనాలు 1960లో మొదలయ్యాయి. ఆ రోజుల్లో జేన్ తల్లి కూడా కూతురుతో పాటు పర్యటించేది. యవ్వనంలో ఉన్న స్త్రీ ఆఫ్రికా అడవుల్లో ఒక్కతే పర్యటించడానికి బ్రిటిష్ ప్రభుత్వం ఒప్పుకోలేదు. కనుక కూతురితో పాటు ఈ పర్యటనలు ఆ తల్లికి తప్పలేదు. మొదటి రెండు వారాలు జేన్‌కి కలిగిన అనుభవాలు కాస్త నిరుత్సాహ పరిచాయి. తనని అంత దూరంలో చూడగానే చింపాజీలు పరుగు అందుకునేవి. పోనీ తను చూసినంత మేరకు కూడా చింపాజీల ప్రవర్తనలో తనకి విశే షంగా ఏమీ కనిపించలేదు. వచ్చిన పని విఫలమయ్యింది అన్న బాధ మనసులో దొలిచేస్తుండగా అనుకోకుండా ఓ సంఘటన జరిగింది. చింపాంజీలు శాకాహారులు అని అంతవరకు జేన్ అనుకునేది. కాని ఒకరోజు ఓ విచిత్రమైన సంఘట కనిపించింది. ఓ చింపాజీ ఓ చెదల పుట్ట పక్క కూర్చుని ఓ పొడవాటి పుల్లని పుట్టలోకి దూర్చి దాంతో చెదలు పట్టి తింటోంది. పుల్లని ఓ పనిముట్టుగా వాడి, దాంతో ఆ పురుగులని వేటాడి తినడం తనకి ఆశ్చర్యంగా అనిపించింది. గిట్టలు, కొమ్ములు, ముక్కులు, పంజాలు మొదలైన దేహాంగాలని కాకుండా మరో వస్తువుని పనిముట్టుగా వాడి ఆహారాన్ని సేకరించడం జంతులోకంలో అరుదైన విషయం. ఆ రోజుల్లో పెద్దగా తెలియని విషయం. పనిముట్లు వాడే దశ ఆదిమానవుడి పరిణామ క్రమంలో ఓ ముఖ్యమైన మలువుగా చెప్పుకుంటాం. అలాంటి పనిముట్ల వినియోగం ఈ జంతువులలో కనిపించడం విశేషం.

చింపాజీలలో ఈ పనిముట్ల వినియోగం గురించి ప్రొఫెసర్ లీకీ కి వివరంగా ఉత్తరం రాసింది. ఆయన సంతోషం పట్టలేకపోయాడు. దీంతో పనిముట్టు, మనిషి మొదలైన పదాలకి కొత్త నిర్వచనాలు ఇవ్వాలి, లేదా చింపాజీలు మనిషితో సమానమని ఒప్పుకోవాలి, అంటూ ఆయన ఉత్సాహంగా జవాబు రాశాడు.

తరువాత జేన్ ధ్యాస చింపాజీలలో సాంఘిక జీవనం మీదకి మళ్లింది. మనుషులలో లాగానే చింపాజీలలో కూడా విస్తృతమైన సాంఘిక పారంపర్యం ఉంటుంది. నువ్వెక్కువా? నేనెక్కువా? అన్న భేటీ మగ చింపాజీల మధ్య తరచు వస్తుంటుంది. బలప్రదర్శనతో మగ చింపాజీలు ఇతర చింపాజీల మీద తమ ఆధిక్యతని చూపించుకునే ప్రయత్నం చేస్తుంటాయి. ఆ బలాబలాల పోటీ గెలిచిన మగ చింపాజీని ఆల్ఫా మేల్ (మొదటి మగాడు!) అంటారు. అతడే ముఠా నాయకుడు అవుతాడు. అయితే అంతకన్నా బలమైన చింపాజీ రంగప్రవేశం చేసినప్పుడు, ఇంద్రపదవి లాగా ఈ పదవి చేతులు మారిపోతుంటుంది! చింపాజీలు సాధు జంతువులు ససేమిరా కాదని తెలుసుకుని జేన్ నిర్ఘాంపోయింది. చింపాజీ ముఠాల మధ్య కొట్లాటలు తరచు జరుగుతుంటాయి. ఒక ముఠా నాయకుడు తన ముఠాతో సహా వెళ్లి శత్రు ముఠా మీద యుద్ధం ప్రకటిస్తాడు. ఆ యుద్ధంలో బలమైన చింపాజీలు బలం తక్కువైన చింపాజీలని తీవ్రంగా గాయపరచి, ఆ గాయలతోనే ప్రాణాలు వొదిలే స్థితికి తెస్తాయి. మనుషుల్లో గ్యాంగ్ వార్‌లకి ఈ కలహాలకి పెద్దగా తేడా ఉన్నట్టు లేదు.

జేన్ చేసిన ఈ ప్రప్రథమ అధ్యయనాలన్నీ చక్కని ఫోటోలతో సహా ఆ రోజుల్లోనే నేషనల్ జ్యాగ్రఫీ పత్రికలో అచ్చయ్యాయి. ఆ ఫోటోలు తీసిన హ్యూగో వాన్ లావిక్‌ని ఆమె తరువాత వివాహం చేసుకుంది.





రాత్రిపూట సూర్యుడు కనిపించలేదని కన్నీరు కారుస్తుంటే ఆఖరికి నక్షత్రాలు కూడా నీకు కనిపించకుండా పోతాయి. -రవీంద్రనాథ్ ఠాగూర్

నవకవిత్వం

# కొన్ని అపజయాలొచ్చినంత మాత్రాన

అడగకముందే అందరికీ దొరుకుతోంది...
నేనడిగినా... అడుక్కున్నా కూడా...
ఏదీ అందకుండా పోతోంది...
కష్టపడకుండా ఏదీ రాదని తెలుసు...
కానీ నా కణకణం కాలి బూడిదవుతున్నా...
కన్నీరే మిగిలి...
అవుతున్నా మీ అందరికీ అలుసు...

నేస్తాల్లారా..!!
తప్పు నాది కాదని మీలో తెలిసేది ఎందరికని..??
తప్పులెంచి తలతిప్పుకు పోతారెందుకని..??
అపశకునాలని నాకు అంటగట్టి అంటరానివాడినంటారా..??
అదృష్టహీనుడని నను హేళన చేసి అవమానపరుస్తారా..??
స్నేహం చేయడం, నమ్మకంగా మెలగడమే నా తప్పా..??
నావాళ్ళుగా మిమ్మల్ని భావించడమే నే కొనితెచ్చుకున్న ముప్పా..??

కొన్ని అపజయాలొచ్చినంత మాత్రాన మనిషి వ్యర్థమవుతాడా..??
కొన్ని విజయాలతోనే ఈ జగాన్నంత యేలేస్తాడా..??
ఎందుకు మీ మూర్ఖత్వాన్ని ప్రదర్శించి చరిత్ర హీనులవుతారు..??
ఎందుకు మీ అమాయకత్వంతో అందరికీ లోకువ అవుతారు..??
ఈరోజు కాకపోయినా రేపైనా నా ప్రతిభ వెలుగులోకి రాదా..??
పశ్చాత్తాపంతో మీరంతా తలదించుకునే రోజు రాదా..??

– బొడ్డు మహేందర్

## రన్నింగ్ వాయిస్




### పజిల్స్ పెంచాలి

ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి. వాస్తు సమాధా నాలు సంతృప్తికరంగా ఉంటు న్నాయి. న్యూమరాలజీ ద్వారా సమ స్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసా గించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–హేమంత్, మౌలాలి

### కలర్ పేజీలు

కవర్ పేజీ కథనం సందర్భోచితంగా ఉంటోంది. పబ్లిక్‌ను ఇన్‌వాల్వ్ చేసే శీర్షి ఎకలు ఇస్తే బాగుంటుంది. అలాగే పాఠకుల అనుభవాలతో కూడిన ఓ శీర్షిక నిర్వహించండి. యూత్‌ను ఎంక రేజ్ చేసే శీర్షికలు, ఆడవారికి నచ్చే ఐటమ్స్ అన్నీ కవర్ అయితే సండే మరింత జనరంజకంగా ఉంటుంది. అన్నీ కలర్ పేజీలలో ఉండేలా చూడండి.

### వింతలు విశేషాలు

ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరి ష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షి కను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కు వగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

## 'కూని'రాగాలు

నమ్మకంతో జీవితం ప్రకాశవంతమౌతుంది..!
అనుమానంతో భవిష్యత్తు భారమౌతుంది..!!

ప్రకృతితో పరాచికాలు ప్రమాదకారకాలు..!
విరక్తితో జీవితాలు దినదిన గండాలు..!!

పులకిస్తే ప్రతీ అణువు కళాత్మకం.!
విరచిస్తే ప్రతీ మలుపు కళాఖండం..!!

హద్దు మీరితే పరిధులు ఏర్పడినట్టే..!
పద్ధతి దాటితే పరిస్థితులు చేజారినట్టే..!!

ఆరోపిస్తే కాదు నిరూపించగలగాలి..!
అరిచేస్తే కాదు కారణముండాలి..!!

- కూనిరెడ్డి శ్రీనివాస్

### ప్రేమించట్లేదేమో?

**శ్రీరాం:** 'లలిత నన్ను ప్రేమించడం లేదనిపి స్తుందిరా!
**ఉపేంద్ర:** ఏం...అలా అని చెప్పిందా?
**శ్రీరాం:** ఆవేశంలో ఉన్నపుడు నీకోసం కొండమీద నుండి దూకమన్నా దూకుతాను, సముద్రంలో ఈదమన్నా ఈదుతాను అంటే ఆ పనులన్నీ చేసి చూపించమంది.

### ఏదో లోపం!

ఓ అందమైన అమ్మా యి డాక్టర్ గదిలోకి హడావు డిగా జొరబడింది.
'నాలో ఏదో లోపం ఉంది డాక్టర్! దయచేసి పరీక్ష చేయండి.'అందామె దిగులుగా.
'మొదటిదేమిటంటే మీకు మేకప్ ఎక్కువగా ఉంది. రెండోది మీ కంటిచూపు సరి గ్గా లేదు. బయట నా నేమ్ బోర్డు మీద 'పశువుల డాక్టర్' అని ఉంది అన్నాడు డాక్టర్ తాపీగా.

### చివరి ఘడియలు...

భర్త మంచం మీద అవసానదశలో ఉన్నాడు.
'సుబ్బా...నా ఆయుష్షు తీరిపోయింది. నేను వెళ్లిపో తున్నాను.' మూలుగుతూ అన్నాడు పరంధామయ్య.
'మీరు లేకుండా నేను ఎలా బతకనండీ? నేనూ మీతో పాటే వస్తాను.' ఏడుస్తూ అంది సుబ్బలక్ష్మి.
'ఓసీ నీయమ్మ కడుపు మాడ! చచ్చిన తర్వాత కూడా నన్ను సుఖపడనీయవా ఏంటే?' చివరి మాట అన్నాడు పరంధామయ్య.

ఫన్ చ్

నారు












ప్రదర్శన ముగియగానే ప్రేక్షకులు వెళ్ళిపోయినట్టుగా ధనం ఎంతయినా చివరకు నశించిపోయేదే.-తిరుక్కురళ్




దీ జంగిల్ బుక్ ఆమెరికాకు చెందిన ఒక యానిమేటెడ్ చిత్రం . దీన్ని వాల్ట్ డిస్నీ సంస్థ నిర్మించింది. ఈ సంస్థకు ఇది 19వ యానిమేటెడ్ చిత్రం. రుడ్యార్డ్ కిప్లింగ్ మోగ్లీ అనే అడవిలో పెరిగిన పిల్లవాడి కథను ఆధారంగా చేసుకుని ది జంగిల్ బుక్ రచించాడు. పిల్లల కోసం మిక్కీ మౌజ్, మిని, డోనాల్డ్ డక్ వంటి కార్టూన్‌లతో సరికొత్త బొమ్మల ప్రపంచాన్ని సృష్టించిన వాల్ట్ డిస్నీ ఈ చిత్రం నిర్మాణ దశలో కన్నుమూశారు. భారతదేశంలోనూ ఈ చిత్రం, తరువాత వచ్చిన సీరియల్స్ పాపులారిటీని సంపాదించాయి. హిందీలో జంగల్ జంగ్‌ల్ పతా చలా హే. చడ్డీ పహన్ కె పూల్ ఖిలా హే పాట నేటికీ హిట్.




# ఇప్పటికీ కొత్తదనమే
# ది జంగిల్ బుక్

మధ్యప్రదేశ్‌లోని ఒక దట్టమైన అడవిలో బాస్కెట్‌లో ఉన్న మోగ్లీని ఒక నల్లని పులి–బఘీరా కనిపెడుతుంది. వెంటనే మోగ్లీని తీసుకుని ఒక తోడేలు దగ్గరికి తీసుకెళ్తుంది . తోడేలుకు అప్పుడే పిల్లలు పుడతారు. దాంతో తన పిల్లలతో పాటు మోగ్లీని కూడా పెంచుకుంది . అడవి జీవులతో,వన్య జీవితంతో చక్కగా కలిసి పోతాడు మోగ్లీ. కొంత కాలం తరువాత టీనేజి కుర్రాడిగా ఎదుగుతాడు.

**షేర్‌ఖాన్ ఎంట్రీ:**

ఒక రోజు రాత్రి అడవిలో మనుషులను తినే బెంగాల్ టైగర్ షేర్ ఖాన్ వచ్చిందని బఘీరాకు తెలుస్తుంది. దీంతో మోగ్లీ అడవిలో ఉండటం ఇక అంత సురక్షితం కాదని భావించి అతడిని దగ్గరిలో ఉన్న మనుషులు నివసించే గ్రామానికి పంపించాలని నిర్ణయిస్తుంది. అదే రోజు రాత్రి బఘీరా మోగ్లీని తీసుకొని బయల్దేరుతుంది. అంతలోనే ఖా అనే పైథాన్ మోగ్లీని చూసి హిప్నటైజ్ చేసి తన అదుపులో తీసుకుంటుంది. స్పృహ కోల్పోయిన మోగ్లీని తినాలని ప్రయత్నించి విఫలమౌతుంది. మరుసటి రోజు ఉదయం తను అడవిలో ఉండాలను కుంటున్నానని మోగ్లీ చెప్పడంతో నీ ఇష్టం వచ్చినట్లు చేయమని చెప్పి బఘీరా వెళ్ళి పోతుంది

**బల్లూ:**

ఇలా ఒంటరైన మోగ్లీకి సరదాగా జీవితాన్ని గడపాలి అని భావించే ఒక నల్లని ఎలుగుబంటి



కనబడుతుంది. దాంతో స్నేహం కుదిరాక దానితో తాను అడవిలోనే ఉండాలనుకుంటున్నాను అని చెబుతాడు మోగ్లీ. దీంతో అడవిలోనే ఉండేలా సహాయపడతానని చెబుతుంది బల్లూ. ఇంతలోనే బల్లూని, మోగ్లీని కింగ్ లూయి (ఒరాంగ్ ఉటాన్) కొతులు

కిడ్నాప్ చేస్తాయి. తనకు ఎర్రని పువ్వు (నిప్పు) ఎలా తయారు చేస్తారో చెబితే వదిలి వేస్తానని షరతు పెడుతుంది లూయి. కానీ మోగ్లీకి ఆ విద్య తెలి

యందం ఎలాగో అక్కడి నుంచి తప్పించుకు వెళ్తారు బల్లూ, మోగ్లీ. తరువాత బల్లూ కూడా మోగ్లీని మనుషుల దగ్గరికి వెళ్లమని చెబుతాడు. దీంతో మోగ్లీ అక్కడి నుంచి వెళ్లిపోతాడు.

**కల్నల్ ఏనుగు:**

మోగ్లీ కనిపించపోవడంతో బల్లూ, బఘీరా కల్నల్ ఏనుగు సహాయం తీసుకుంటారు. మోగ్లీని మళ్లీ ఖా హిప్నటైజ్ చేసి తినాలనుకుంటుంది. మోగ్లీ ఎలాగో తప్పించుకుంటాడు. అడవిలో ప్రవేశించగానే షేర్ ఖాన్ ఎదురౌతుంది. అంతలోనే ఆకాశం నుంచి పిడుగులు పడటం వల్ల చెట్లకు మంటలంటుకుంటాయి. మోగ్లీ వెంటనే ఒక కర్రకు అంటుకున్న నిప్పును తీసుకుని షేర్‌ఖాన్ తోకకు అంటిస్తాడు. షేర్‌ఖాన్ నీటి వైపు పరిగెత్తుతుంది. ఇంతలొనే మోగ్లీని వెదుక్కుంటు బఘీరా, బల్లూ, కల్నల్ ఏనుగులు వస్తాయి. మోగ్లీని మనుషుల నివాసానికి తీసుకెళ్తుండగా

మధ్యలో ఒక చెరువు వద్ద ఒకమ్మాయి నీళ్లు పట్టుకోవడానికి వస్తుంది. ఆమె బిందె నీళ్ళలో పడిపోవడంతో మోగ్లీ దాన్ని అందిస్తాడు. దీంతో వారి మధ్య స్నేహం కుదురుతుంది. మోగ్లీ ఆమె వెంటనే వెళ్తూ గ్రామంలోకి ప్రవేశిస్తాడు. ఇక కథ కంచికి మనం ఇంటికి.

మోగ్లీ కనిపించపోవడంతో బల్లూ, బఘీరా కల్నల్ ఏనుగు సహాయం తీసుకుంటారు. మోగ్లీని మళ్లీ ఖా హిప్నటైజ్ చేసి తినాలనుకుంటుంది. మోగ్లీ ఎలాగో తప్పించుకుంటాడు. అడవిలో ప్రవేశించగానే షేర్ ఖాన్ ఎదురౌతుంది. అంతలోనే ఆకాశం నుంచి పిడుగులు పడటం వల్ల చెట్లకు మంటలంటుకుంటాయి. మోగ్లీ వెంటనే ఒక కర్రకు అంటుకున్న నిప్పును తీసుకుని షేర్‌ఖాన్ తోకకు అంటిస్తాడు.

**67లో వచ్చిన యానిమేషన్ మూవీ:**

సాహసం, వినోదం అంశాలతో వాల్ట్ డిస్నీ సంస్థ 1967లో నిర్మించిన యానిమేషన్ చిత్రం 'జంగిల్ బుక్' అప్పట్లో అది ఒక సంచలనం. ఇప్పటికీ అది టీవీ ప్రసారాల ద్వారా పిల్లల్ని ఎంత గా నో



ఆకట్టుకుంటోంది.

**మరో సారి 3 డిలో:**

ఇప్పుడున్న ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి 3డి లో సరికొత్తగా మరోమారు ' ది జంగిల్ బుక్' చిత్రాన్ని తెరకెక్కిస్తున్నారు. జోన్ ఫేవ్‌ర్యూ ఈచిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. తాజాగా ఈ సినిమాకు సంబంధించిన అఫీషియల్ ట్రైలర్ రిలీజ్ చేసింది వాల్ట్ డిస్నీ.. చూసిన ప్రతి ఒక్కరు ట్రైలర్ అద్భుతంగా ఉంది అంటున్నారు. సినిమాలోని బాలుడు మోగ్లీ క్యారెక్టర్ తప్ప అన్నీ గ్రాఫిక్సే.. అయినా రియాల్టీని తలపిం చేలా గ్రాఫిక్స్ ఉండటం గమ నార్హం. ఇక్కడ మరో విశేషం ఏమిటంటే ప్రధాన పాత్ర మోగ్లీగా నటించే అవకాశం భారతీయ – అమెరికన్ అయిన నీల్ సేథీకి దక్కింది. మోగ్లీ ప్రాత్రదారి నీల్ సేథి ఎంపికపై దర్శకుడు జోన్ ఫేవ్‌ర్యూ మాట్లాడుతూ "ప్రపంచవ్యాప్తంగా అనేకమందిని వెతికాం. న్యూయార్క్ నుంచి న్యూజిలాండ్ వరకు, లండన్ నుంచి కెనడా వరకు, అమెరికా, భారతదేశం... మూలమూలలా వెదికిన తర్వాత పదేళ్ళ నీల్ సేథీని ఏకగ్రీవంగా ఎంపిక చేశాం" అని అన్నారు. అడవిలోని జంతువులు పెంచి పెద్ద చేసిన ఓ పసివాడి కథ ఆధారంగా సాగే చిత్రమే ది జంగిల బుక్'. ఈ సినిమా ఏప్రిల్ 15, 2016లో విడుదల అవుతుంది.

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి 3డి లో సరికొత్తగా మరోమారు ' ది జంగిల్ బుక్' చిత్రాన్ని తెరకెక్కిస్తున్నారు. జోన్ ఫేవ్‌ర్యూ ఈచిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. తాజాగా ఈ సినిమాకు సంబంధించిన అఫీషియల్ ట్రైలర్ రిలీజ్ చేసింది వాల్ట్ డిస్నీ.. చూసిన ప్రతి ఒక్కరు ట్రైలర్ అద్భుతంగా ఉంది అంటున్నారు.

Directed by : Wolfgang Reitherman
Produced by : Walt Disney
Screenplay by :Larry Clemmons
Ralph Wright
Ken Anderson
Vance Gerry
Based on : The Jungle Book by Rudyard Kipling
Starring : Phil Harris
Sebastian Cabot
Louis Prima
George Sanders
Sterling Holloway
Narrated by :Sebastian Cabot
Music by : George Bruns (Score)
Terry Gilkyson
Richard M. Sherman
\Production company : Walt Disney Productions
Release date : October 18, 1967
Running time : 78 minutes
Country : United States
Language : English
Budget : $4 million



అలవాటు అనేదాన్ని అరికట్టకపోతే, అది త్వరలోనే ఒక అవసరంగా మారిపోతుంది.-సెయింట్ ఆగస్టిన్



1980-90ల మధ్యకాలంలో దర్శకుడిగా ఎంట్రీ ఇచ్చారు కోదండరామిరెడ్డి. సంధ్య చిత్రంతో దర్శకుడిగా తన సత్తా నిరూపించుకున్నాడు. కె.రాఘవేంద్రరావు శిష్యుడిగా పరిచయం అయ్యాడు...అందుకే ఆయనలాగే తన ప్రతి పాటనూ ఎంతో రిచ్‌గా చూపించేవాడు. చిరంజీవి, కె.ఎస్.రామారావు, ఎ.కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో వచ్చిన ప్రతి సినిమా బ్లాక్‌బస్టర్ విజయం సాధించింది. కొన్ని బ్యానర్లు కేవలం కోదండరామిరెడ్డితోనే తమ సినిమాలను తీసి మంచి విజయాలను సొంతం చేసుకున్నాయి. దాదాపు 90కి పైగా సినిమాలు చేసిన కోదండరామిరెడ్డి అందులో 25 చిత్రాలు మెగాస్టార్ చిరంజీవితోనే. చిరును రాత్రికి రాత్రి మెగా హీరోగా మార్చేసిన దర్శకుడు కూడా ఆయనే.



# విజయోత్సవ చిత్రాల దర్శకుడు

1950, జూలై 1న ఆంధ్రప్రదేశ్ లోని నెల్లూరులో కోదండరామిరెడ్డి గారు జన్మించారు. 1980లో 'సంధ్య' సినిమాతో దర్శకుడిగా తెలుగు తెరకు పరిచయమయ్యారు. పట్టున్న కథను గుట్టుగా పట్టి, దానికి అనువైన మసాలాలు దట్టించి, జనాన్ని కట్టిపడేసిన చతురుడు దర్శకుడు ఎ.కోదండరామిరెడ్డి. ఆయన పేరు వినగానే ఠక్కున చిరంజీవి గుర్తొస్తారు. అదేంటి కోదండరామిరెడ్డి పేరు వింటే చిరు పేరు గుర్తుకు రావడమేంటనే ప్రశ్నకు సమాధానం వీళ్ళిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన బ్లాక్ బస్టర్ హిట్సే.

చిరంజీవిని టాప్ స్టార్‌గా నిలిపింది నిస్సందేహంగా కోదండరామిరెడ్డి చిత్రాలేనని చెప్పొచ్చు. చిరంజీవి మెగాస్టార్ అయ్యేందుకు ఓ రూపొందించిన కోదండరామి రెడ్డి వంద సినిమాల మైలు రాయి దాటాలని ప్రయత్నిస్తు న్నారు. కె.రాఘవేంద్రరావు శిష్యుడైన కోదండరామిరెడ్డికి దర్శకుడిగా తొలిచిత్రం సంధ్య. హిందీ చిత్రం 'తపస్య' ఆధారంగా తీసారు. కుటుంబ చిత్రంగా ఆ చిత్రం గొప్పగా విజయవంతమైంది. చాలా కొద్దికాలంలోనే పెద్ద హీరోలతో అవకాశాలు వచ్చాయి. చిరంజీవిని తారాపథానికి తీసుకెళ్ళిన ఖైదీ చిత్రం కోదండరామిరెడ్డి దర్శకత్వంలో వచ్చింది. న్యాయం కావాలి చిత్రంతో మొదలైన వీరి సినీ నిర్మాణ బంధం ముఠా మేస్త్రి సినిమా వరకు సాగింది. వీరిద్దరు కలిపి 23 సినిమాలకు పనిచేసారు. అందులో 80% విజయం సాధించాయి. ఆ కాలంలోని కథానాయకుల్లో ఒక్క ఎన్.టి.ఆర్‌తో తప్ప అందరు ప్రముఖ నటులతోనూ చిత్రాలు తీసారు.

అవన్నీ ఫలించలేదు. చివరకు పి.చంద్రశేఖర్‌రెడ్డి కూడా నెల్లూరే కావడంతో ప్రాంతీయాభిమానంతో కోదండరామిరెడ్డిని తన వద్ద చేర్చుకున్నాడు. ఆ తర్వాత వి.మధుసూధనరావుకు పరిచయం చేశారు. అక్కడే కె.రాఘవేంద్రరావు పరిచయం అయ్యారు. ఆ తర్వాత రాఘవేంద్రరావుతో ట్రావెల్ అవుతూ వచ్చారు కోదండరామిరెడ్డి. వి.మధుసూధనరావు వద్ద కూడా అప్పుడప్పుడూ అవకాశం వచ్చినప్పుడు పనిచేశాడు.

అయితే సంధ్య సినిమాకంటే ముందుగా రాం రాబర్ట్ రహీమ్ చిత్రానికి దర్శకత్వం వహించే అవకాశం లభించింది. అయితే ఆ చిత్ర నిర్మాతలు కోదండరామిరెడ్డి కొత్త దర్శకుడు కదా  అని ధైర్యం చేయలేకపోయారు. అయితే ఆ చిత్రానికి విజయనిర్మల దర్శకత్వం వహించారు. ఆ చిత్రం హిందీలో అమితాబ్ నటించిన బ్లాక్‌బస్టర్ చిత్రం రామ్ రాబర్ట్



మైలురాయిగా నిలిచిన సినిమా 'ఖైదీ'. చిరంజీ వితోనే కోదండరామిరెడ్డి పలు ప్రయోగాలు చేస్తూ సాగారు... అందుకు తగ్గ ఫలితాలనే సాధిం చారు. ఇదే తరహాలో బాలకృష్ణ, నాగార్జున, వెంకటేష్ తోనూ కోదండరామిరెడ్డి విజయయాత్ర సాగించారు. రెండు దశాబ్దాలుగా దాదాపు 90కి పైగా వైవిధ్యమైన చిత్రాలతో ప్రేక్షకుల్ని మెప్పించిన ఘనత కోదండ రామిరెడ్డిదే అనటంలో అతిశ యోక్తి లేదు. తెలుగు సినిమా చరిత్రలో దర్శకుడిగా తన కంటూ ఓ ప్రత్యేక గుర్తిం పుని, శైలిని కోదండరామిరెడ్డి సృష్టించుకున్నారు. కోదండ రామిరెడ్డి కొన్ని చిత్రాలకు నిర్మాతగానూ వ్యవహరిం చారు. అయితే దర్శకునిగానే కోదండరామిరెడ్డి జనం మదిలో నిలచిపోయారు.

ఇప్పటి వరకు 97 చిత్రాలను

కోదండరామిరెడ్డి నెల్లూరు జిల్లా మైపాడులో మధ్య తరగతి వ్యవసాయ కుటుంబంలో జన్మించాడు. ఈయన తండ్రి వెంకూరెడ్డి, తల్లి రమణమ్మ. ఇందుకూరుపేట, నరసాపురంలో చదువు కొనసాగించి, ఎస్.ఎస్.ఎల్.సి దాకా చదువుకున్నాడు. విద్యార్థి దశనుండే నాటకాలంటే కోదండరామిరెడ్డికి పిచ్చి. పీయూసీ చదువుతూ మధ్యలోనే చదువు మానేసి సినిమాల్లో హీరో అవ్వాలనే కోరికతో రైలెక్కి మద్రాసు వచ్చాడు.

హీరోగా అవుదామని: మొదట హీరోగా అవుదామని చాలా ప్రయత్నాలే చేశాడు.



రహీమ్ చిత్రానికి రీమేక్. తెలుగులో సూపర్‌స్టార్ కృష్ణ, రజనీకాంత్‌లు హీరోలుగా నటించారు. తొలి చిత్రమే మల్టీ స్టారర్ చిత్రాన్ని చేసే ఛాన్స్ మిస్ అయ్యారు కోదండరామిరెడ్డి. అయితేనేం తర్వాత తనేమిటో నిరూపించుకుని హీరో కృష్ణకు కూడా ఎన్నో విజయవంతమైన చిత్రాలను అందిం చారు. ఆ రోజుల్లో ఒక్క సీనియర్ ఎన్‌టీ రామారావుతో తప్ప మిగిలిన అందరి హీరోలతో పనిచేసిన ఏకైక దర్శకుడు.

తన కుమారుడు వైభవ్‌ను హీరోగా తెరంగేట్రం చేయించారు. అయితే వైభవ్ హీరోగా అంతగా నిలదొక్కుకోలేకపోయాడు. ఇంకా అవకాశాల వేటనే కొనసాగిస్తున్నాడు వైభవ్.

చిరంజీవితో ఖైదీ చిత్రం చేసేముందర ఆ స్టోరీకి హీరో కృష్ణను సంప్రదించడం జరిగింది. అయితే కృష్ణ బిజీగా ఉండి హీరో చిరంజీవి పేరును ప్రపోజ్ చేయడం జరిగింది. అంతే ఆ సినిమాతో చిరంజీవి స్టార్‌డమ్ ఒక్కసారిగా మారిపోయింది. కోదండరామిరెడ్డితో చిరంజీవి దాదాపు 25 సినిమాలు చేశాడు. అందులో ఎక్కువ శాతం విజయం సాధించాయి. క్రియేటివ్ కమర్షియల్స్ బ్యానర్ నిర్మాత కె.ఎస్.రామారావుతో గట్టి అనుబంధం ఏర్పడింది. వరుసపెట్టి అభిలాష, ఛాలెంజ్, రాక్షసుడు, మరణమృదంగం, స్టువర్ట్‌పురం పోలీస్ స్టేషన్ వంటి నవలా చిత్రాలకు దర్శకత్వం వహించాడు కోదండరామిరెడ్డి.

# సేవ..కులుగా మారండి

మనకు స్వాతంత్ర్యం వచ్చి సుమారుగా 70 సంవత్సరాలు అవుతుంది. అప్పటినుండి లంచగొండితనం, నల్ల డబ్బు రాజ్యమేలుతుంది. సామాన్యుడు సామాన్యుడిలాగే బ్రతుకుతున్నాడు. డబ్బున్నోడు డబ్బుకు కక్కుర్తిపడి అడ్డదారులు తొక్కుతూ, యధేచ్ఛగా కోట్లరూపాయలను దండుకుంటూ దేశ ఆర్థిక వ్యవస్థను తూట్లు పొడుస్తున్నాడు. వీరికి బడాబాబులు, రాజకీయనాయకుల అండదండలు పుష్కలంగా ఉండడంతో వీరు ఆడిందే ఆటగా సాగుతుంది.

ఇలాంటి పరిస్థితులలో దేశ ఆర్థిక వ్యవస్థను పటిష్టం చేయాలన్న సంకల్పంతో మన ప్రధాని మోడీ గారు నల్లధనానికి చెక్ పెట్టాలని, ఉన్నపళంగా రాత్రికి రాత్రే



500 మరియు 1000 నోట్లను రద్దుచేసారు. ఎందుకంటే మనదేశంలో పెద్దనోట్లు రూపంలో దొంగనోట్లు చెలామణీ అవుతున్నాయి. వీటివల్ల దేశ ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నం అవుతుంది.

నవంబరు 8 తారీఖు నుండి పెద్ద నోట్లను కట్టడి చేయడంతో దేశంలో ఉన్న కోట్లాది రూపాయల నల్లధనం గుట్టలు గుట్టలుగా బయటకు వస్తుంది. బడాబాబులు అధికారుల, రాజకీయ నాయకుల అండదండలతో అడ్డదారుల్లో కోట్లాదిరూపాయలను కూడబెడుతూ ప్రభుత్వానికి కట్టవలసిన టాక్స్‌ను కట్టకుండా ఎగ్గొడుతూ నల్లధనాన్ని, కేజీల కొద్ది బంగారాన్ని బాత్ రూమ్, బెడ్‌రూమ్ గోడల అరలలో దాచి డబ్బును బ్లాక్ చేస్తున్నారు.

భారత ప్రభుత్వం నల్లధనాన్ని రూపుమాపడానికి పెద్దనోట్లను రద్దుచేసి వాటి స్థానంలో 2000 నోట్లను తెచ్చింది. కేంద్రప్రభుత్వం బడాబాబులను టార్గెట్ చేస్తే, ఆ ఎఫెక్ట్ సామాన్య మానవుడిపై పడింది.

బడాబాబులు ఇంట్లోనుండి కదలకుండా బ్లాక్‌మనీని కమీషన్ బేసిస్‌లో కొంతమంది బ్యాంకు అధికారులతో కుమ్మక్కై నలుపును తెలుపుగా మార్చుకుం టున్నారు. పేద, మధ్యతరగతి ప్రజలే రెండువేల రూపాయలు కొరకు బ్యాంకులవద్ద పగలనక , రేయనక పడిగాపులు కాస్తున్నారు.

ఒక్కడి దగ్గరే సుమారుగా 70 కోట్ల కొత్త కరెన్సీ అవలీలగా మార్పిడి జరిగిందంటే వ్యవస్థ ఎంత అవినీతి మయంగా తయారయిందో తెలుసుకోవచ్చు. కేవలం కొంతమంది దళారుల వల్ల దేశంలో ఉన్న కొన్ని కోట్లరూపాయల బ్లాక్‌మనీ ట్రాన్స్‌క్షన్ లోనికి రాకుండా వైట్‌గా మారిపోతుంది.

నేను ఒక సాధారణ భారతీయుణ్నిగా రెండువేలు కరెన్సీ కోసం రోజు మూడు గంటలపాటు లైన్లో నిలబడాల్సి వస్తుంది. తీరా కౌంటర్ దగ్గరకు వళ్లేసరికి నో క్యాష్ బోర్డులు దర్శనమిస్తున్నాయి.

దేశంలో నల్లకుబేరులు కొన్ని లక్షలకోట్ల రూపాయలను అక్రమ మార్గాలలో సంపాదిస్తున్నారు. ఎంత సంపాదించినా పుట్టినప్పుడు ఒక్కరమే వచ్చాము. చనిపోయినపుడు ఒక్కరమే వెళ్తాము. ఏమీ పట్టుకెళ్లము మనల్ని పూడ్చిపెట్ట



డానికి ఆరడుగుల నేల తప్ప. చివరకు మిగిలేవి రెండే మనం చేసిన మంచి, చెడు.

దేశంలో కొన్ని వందల సంఖ్యలో అనాధ ఆశ్రమాలు, వృద్ధాశ్రమాలు ఉన్నాయి. పూటకు తిండి దొరక్క కొన్ని వేల మంది ప్రతీరోజు ఆకలితో చనిపోతున్నారు.

నల్ల కుబేరులు అడ్డగోలుగా సంపాదించిన కోట్ల రూపాయలు అక్రమ సంపాదన నుండి కొంతైనా అనాధలనీ, వికలాంగులకీ, వృద్ధుల సేవకీ ఖర్చుపెట్టినట్లయితే దేశంలోని సగానికి సగం పేదరికాన్ని నిర్మూలించవచ్చు. వారికి పుణ్యము దక్కుతుంది.

కానీ డబ్బున్న బడాబాబులు మాత్రం ఇతరులకు సహాయం చేయడానికి మనసొప్పక నోట్ల కట్టలను భూమిలో పాతిపెట్టడం, నీళ్లలో పారవేయడం, బాత్‌రూం, బెడ్‌రూం అరలలో దాచి పెట్టడం చేస్తున్నారు.

కష్టపడి సంపాదించిన డబ్బు నిన్ను కాపాడుతుంది కష్టపెట్టి సంపాదించిన డబ్బు నిన్నే కాటేస్తుంది... అన్న చందంలా అన్నీ తెలిసిన మనిషి వివరం తెలియక బ్రతికేస్తున్నాడు.



జీవితం శాశ్వతం కాదనీ తెలిసి కూడా ఏ ఒక్కడు సమాజానికి మేలు చేద్దామనో లేక ఉద్ధరిద్దామనో ముందుకు రావడం లేదు.

31 డిసెంబర్ తర్వాత ఎలాగూ వెల్లడించని ధనం అంతా భోగిమంటలలోనో లేక చెత్తకుప్పల్లోనో, గంగపాలో చేయక తప్పదు. అలాంటప్పుడు కనీసం నల్లడబ్బు కుబేరులు కాస్తలో కాస్తయినా మానవత్వంతో మసిలితే బాగుంటుంది. నిరుపయోగం కాబోయే ధనాన్ని సమాజంలో కూడు, గుడ్డ, నీడ లేని పేదలకో లేక వృద్ధాశ్రమాలు నడిపే ట్రస్టులకో, అనాధలను ఆదరించే స్వచ్ఛంద సంస్థలకో ఉపయోగిస్తే బాగుం టుంది. నల్లకుబేరులు తమలోనూ మానవత్వం ఉందని చాటుకునేందుకు ఇదే ఆఖరి అవకాశం. ఒక్క నిమిషం ఆలోచించండి...



డా.ఎమ్ శ్రీనివాస్‌రావ్
సెల్.94639966,96522 20221

# ప్రయాణ సమయంలో చూడాల్సిన శుభశకునాలు

## వారాలు – ఫలాలు

1. ఆదివారం ప్రయాణం చేస్తే, నాశం; సోమవారం శక్తిక్షయం, అర్ధనాశం; మంగళవారం అగ్నిభయం, రక్తపిత్త రోగాలు; బుధవారం స్నేహలాభం ; గురువారం జయధన లాభం; శుక్రవారం స్త్రీ, వస్త్ర, గంధ ధన లాభాలు; శనివారం ప్రయాణిస్తే దైన్యం, వధ, బంధనం, రోగం కలుగుతాయి.
2. నక్షత్రాలు
   ప్రయాణానికి అశ్విని, పునర్వసు, అనూరాధ, మృగశిర, పుష్యమి, రేవతి, హస్త, శ్రవణం, ధనిష్ఠ – తొమ్మిది నక్షత్రాలు ప్రశస్త నక్షత్రాలు.
   ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శతభిషం, మూల, జ్యేష్ఠ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, రోహిణి నక్షత్రాలు మధ్యమాలు. కృత్తిక, స్వాతి, ఆర్ద్ర, విశాఖ, చిత్త, ఆశ్లేష, మఘ, భరణిలు నిషిద్ధాలు.
3. తిథిశూలలు
   తూర్పు దిశకు పాడ్యమి, నవమి; ఉత్తర దిశకు విదియ, దశమి, ఆగ్నేయానికి తదియ, ఏకాదశి; నైరుతి దిశకు చవితి, ద్వాదశి; దక్షిణ దిశకు పంచమి, త్రయోదశి; పడమర దిశకు చవితి, షష్ఠి, త్రయోదశి; వాయవ్యానికి సప్తమి, పూర్ణిమ, అమావాస్య, ఈశాన్యానికి అష్టమి, అమావాస్య తిథి శూలలు. ఆయా దిక్కులకు ప్రయాణం చేసే సమయంలో పైన తెలిపిన తిథులు ప్రయాణానికి పనికిరావు.
4. వారశూల,– నక్షత్ర శూల:
   జ్యేష్ఠా నక్షత్రంలో సోమ, శని వారాల్లో తూర్పు నకు, పూర్వాభాద్ర నక్షత్రంలో గురువారంలో దక్షిణానికి, రోహిణి నక్షత్రంలో ఆది, శుక్ర వారాల్లో పశ్చిమానికి, ఉత్తర నక్షత్రంలో మంగళ, బుధ వారాల్లో ఉత్తరానికి ప్రయాణించడం మంచిది కాదు.
5. ఆదివారం నెయ్యి, సోమవారం పాలు, మంగళవారం బెల్లం, బుధవారం నువ్వులు, గురువారం పెరుగు, శుక్రవారం యవలు, శనివారం మినుములు తిని ప్రయాణం చేస్తే వారదోషాలు తొలగిపోతాయి.
6. కాలశూల
   స్థిర, మిశ్ర నక్షత్రాల్లో పూర్వాహ్ణంలోను, తీక్షణ నక్షత్రాల్లో మధ్యాహ్నం, లఘు నక్షత్రాల్లో అపరాహ్ణంలో, మిత్ర నక్షత్రాల్లో పూర్వ రాత్రుల్లో, ఉగ్ర నక్షత్రాల్లో మధ్యరాత్రంలోను, చర నక్షత్రాల్లో రాత్ర్యంతంలో ప్రయాణం చేయడం నిషిద్ధం.
   శ్రవణం, హస్త, పుష్యమి, మృగశిర నక్షత్రాల యందు అన్ని కాలాల్లో యాత్ర చేయవచ్చు.
7. లగ్నశూల
   తుల, కుంభ లగ్నాల్లో తూర్పునకు, మీన, వృశ్చికాల లగ్నాల్లో దక్షిణానికి, సింహ, ధనసు లగ్నాల్లో పశ్చిమానికి, వృషభ, కన్య లగ్నాల్లో ఉత్తరానికి, మకర లగ్నంలో ఆగ్నేయం, కర్కాట లగ్నంలో నైరుతి, మేష లగ్నంలో వాయవ్యం, మిథునం లగ్నంలో ఈశాన్యానికి ప్రయాణం చేయకూడదు.
8. ఒక కాగితం మీద ఆగ్నేయం నుంచి వాయవ్యానికి, నైరుతి నుంచి ఈశాన్యానికి రెండు రేఖలు కోణంలా గీస్తే, దానిని పరిఘాచక్రం అంటారు. దానికి తూర్పు నుంచి కృత్తికాదిగా ఆశ్లేషాంతం వరకు, దక్షిణాన మఘ నుంచి విశాఖ వరకు, పడమర అనూరాధ నుంచి శ్రవణం వరకు, ఉత్తరాన ధనిష్ఠ నుంచి భరణి వరకు నక్షత్రాలు రాసి, ఏ దిశలో ప్రయాణ నక్షత్రం ఉంటుందో ఆ దిశలో ప్రయాణం చేయకూడదు.
   తూర్పుకు మేషం, సింహం, ధనస్సులు, దక్షిణానికి వృషభం, కన్య, మకరాలు, పడమరకు మిథునం, తుల, కుంభాలు, ఉత్తరానికి కర్కాటకం, వృశ్చికం, మీనాలు ద్వార రాశులు. ఈ లగ్నాల్లో ఆయా దిక్కులకు ప్రయాణం చేయకూడదు.
9. ప్రయాణ లగ్న ఫలాలు
   మేషంలో ప్రయాణం చేస్తే శుభం, వృషభంలో సుఖం, మిథునంలో మృత్యుప్రదం, కర్కాటకంలో ధన, భూలాభాలు, సింహంలో వ్యసనం, కన్యలో జ్వర భయం, తులలో ధనలాభం, వృశ్చికంలో కలహం, ధనస్సులో క్షేమం, మకరంలో స్త్రీ లాభం, కుంభంలో కౌటిల్యం, మీనంలో భోజన సుఖం కలుగుతాయి.
10. ఏకాదశి సోమవారం, ద్వాదశి శనివారం, షష్ఠి గురువారం, తదియ బుధవారం, అష్టమి శుక్రవారం, నవమి ఆదివారం, పంచమి మంగళవారం వచ్చిన రోజులు దగ్ధయోగం కలిగినవి.
    భరణి ఆదివారం, చిత్త సోమవారం, ఉత్తరాషాఢ మంగళవారం, ధనిష్ఠ బుధవారం, ఉత్తర గురువారం, జ్యేష్ఠా శుక్రవారం రేవతి శనివారం వచ్చిన రోజులు ప్రయాణానికి పనికిరావు.
11. ప్రతి శుక్ర, భౌమ బుధ దోషాలు
    ప్రయాణం అయ్యేటపుడు తిరిగి ఇంటికి బయలు దేరే సమయంలో కుజ, శుక్ర, బుధులకు అభిముఖంగా ప్రయాణించకూడదు. ప్రయాణించే వారికి దక్షిణ భాగంలో శుక్రుడు ఉంటే అశుభం. పీడ కలుగుతుంది. శుక్రుడు తూర్పు దిశలో ఉన్నప్పుడు వాయువ్య, ఉత్తర, ఈశాన్య దిశలకు గాని, శుక్రుడు పడమర దిశలో ఉన్నప్పుడు నైరుతి, దక్షిణ, ఆగ్నేయ దిశల వైపు ప్రయాణించ కూడదు. ప్రయాణం మధ్యలో ఎదురుగా బుధుడు ఉదయిస్తే, ఆ బుధుడు అస్తమించి తిరిగి ఉదయించే వరకు ప్రయాణం చేయకూడదు.

–సుసర్ల బాబూరావు
ఎం.ఏ (ఆస్ట్రాలజీ)



మేధస్సును గురించి గొప్పగా చెబుతుంటారు అందరూ. కాని మానవ జీవితాన్ని నడిపించేది అదృష్టమే కాని మేధస్సు కానేకాదు. -సి.సి.రో

# అలుపెరుగని అందాలు





ఇప్పుడు ఇండియాలో ఉన్న సీనియర్ నటులందరి కన్నూ తెలుగు ఫిలిం ఇండస్ట్రీపైనే పడిందా అంటే అవుననే చెప్పాలి. మొన్నటికి మొన్న మోహన్ లాల్ జనతా గ్యారేజ్‌తో వచ్చాడు. తరువాత డ్రీమ్ గాళ్ హేమా మాలిని గౌతమీపుత్ర శాతకర్ణితో ఎంట్రీ ఇవ్వనుంది. ఇప్పుడు ఇదే బాటలో మరో బాలీవుడ్ సీనియర్ రేఖ కూడా రానుంది. 1966లో తెలుగు సినిమా 'రంగులరాట్నం'లో ఒక చైల్డ్ ఆర్టిస్ట్ భానురేఖ మెరిసింది. కాలాంతరంలో ఆమె రేఖ అనే ఒక గార్జియస్ హీరోయిన్‌గా బాలీవుడ్‌లో దుమ్ముదులిపేసింది. ఈ రేఖ ఎవరో కాదు.. మన మహానటి సావిత్రి భర్త నటుడు జెమినీ గణేశన్ రెండో భార్య కూతురు. ఇప్పుడు రాజ్యసభ ఎంపి అయిన 62 ఏళ్ళ రేఖ.. మరో ఎంపి అయిన హేమామాలిని తరహాలో ఒక తెలుగు సినిమాలో నటిస్తోంది. పూర్ణ (షామ్నా కాసిం) హీరోయిన్‌గా రూపొందుతున్న ఒక సినిమాలో.. ఫ్లాష్ బ్యాక్ లో పూర్ణ కూతురిగా రేఖ కనిపిస్తుంది. బ్లాక్ అండ్ వైట్ లో తీయబడే ఈ ఎపిసోడ్ కోసం ఆల్రెడీ రేఖ సిద్ధమవుతున్నట్లు తెలుస్తోంది.

విశేషం ఏంటంటే.. హేమమాలిని కూడా ఎప్పుడో 1968లో తెలుగులో పాండవ వనవాసం సినిమాలో ఒక సైడ్ డ్యాన్సర్ గా నటించింది. ఇప్పుడు ఒకటే సంవత్సరంలో ఆమె మరియు రేఖ మళ్ళీ ఒకటే సంవత్సరంలో తెలుగు తెరపై దండయాత్ర చేయడం విశేషం.

హేమమాలిని (జననం 16 అక్టోబరు 1948), ప్రముఖ భారతీయ నటి, దర్శకుడు, నిర్మాత, నాట్యకళాకారిణి, రాజకీయ నాయకురాలు. తమిళ చిత్రం ఇదు సతియం అనే సినిమాలో సహాయ నటి పాత్రతో తెరంగేట్రం చేశారు హేమ. సప్నో కా సౌదాగర్(1968) సినిమాతో హీరోయిన్ అయ్యారు ఆమె. బాలీవుడ్ లో ఎన్నో విజయవంతమైన సినిమాల్లో నటించిన హేమ ఎక్కువగా ధర్మేంద్ర, రాజేశ్ ఖన్నా, దేవానంద్ లతో సినిమాలు చేశారు. హిట్ జంటగా పేరు పొందిన హేమా మాలినీ, ధర్మేంద్ర తరువాతి కాలంలో వివాహం చేసుకున్నారు కూడా.

హేమను మొదట్నుంచీ అభిమానులు డ్రీమ్ గర్ల్ అని పిలిచేవారు. 1977లో అదే పేరుతో సినిమా కూడా చేశారామె. మంచి నాట్యకళాకారిణి అయిన హేమ మంచి నటిగా కూడా గుర్తింపు తెచ్చుకున్నారు. దాదాపు 150 సినిమాల్లో నటించారు ఆమె. ఫిలింఫేర్ ఉత్తమ నటి పురస్కారానికి 11 నామినేషన్లు సంపాదించుకున్న హేమా 1972లో పురస్కారం గెలుచుకున్నారు. ఫిలింఫేర్ జీవిత సాఫల్య పురస్కారం, పద్మశ్రీ పురస్కారం అందుకున్నారు ఆమె. 2012లో సర్ పదంపత్ సింఘానియా విశ్వవిద్యాలయం ఆమెకు గౌరవ డాక్టరేట్ ఇచ్చి గౌరవించింది. జాతీయ సినిమా అభివృద్ధి కార్పొరేషన్‌కు చైర్ పర్సన్‌గా వ్యవహరించారు హేమ. భారతీయ సంస్కృతి నృత్యాల విషయంలో ఆమె సేవలకు గుర్తింపుగా ఢిల్లీకి చెందిన భజన్ సపోరీ సంస్థ ఆమెను సొపోరీ అకాడమీ సంగీత, కళ విటస్టా పురస్కారం ఇచ్చి గౌరవించారు.

2003 నుంచి 2009 వరకు భారతీయ జనతా పార్టీ నుంచి రాజ్యసభ సభ్యురాలిగా వ్యవహరించారు హేమ. ఎన్నో సేవా కార్యక్రమాలలో కూడా పాల్గొన్నారు ఆమె.

ధర్మేంద్రతో వివాహం తరువాత కూడా ఆమె సినిమాల్లో నటించారు. క్రాంతి, నసీబ్(1981), సత్తే పే సత్తే, రాజ్ పుత్, ఏక్ నయీ పహేలీ (1984) వంటి సినిమాలు చేశారు హేమా. ఏక్ నయా పహేలీ సినిమాలో రాజేశ్ ఖన్నా సరసన శాస్త్రీయ సంగీత విద్వాంసురాలిగా ఆమె నటన ఎంతో ప్రాచుర్యం పొందింది. ప్రముఖ పత్రిక టైమ్స్ ఆఫ్ ఇండియా వీరిద్దరినీ టాప్ జంటగా ప్రకటించింది. 22 ఆ తరువాత ఆంధీ తూఫాన్, దుర్గా(1985), రాంకలీ(1985), సీతాపూర్ కీ గీతా(1987), ఏక్ చదర్ మైలీ సీ(1986), రిహే, జమాయ్ రాజా(1990) వంటి పలు చిత్రాల్లో నటించారు హేమా.

ఇదే సమయంలో ధర్మేంద్రతో కలసి ఆలీబాబా ఔర్ 40 చోర్, భగవత్, సామ్రాట్, రజియా సుల్తాన్, అంధా కానూన్(1983), రాజ్ తిలక్ (1984) వంటి సినిమాల్లో నటించారు హేమ.

షారుఖ్ ఖాన్, దివ్యభారతిలు హీరో, హీరోయిన్లుగా హేమా దిల్ ఆశా హై అనే సినిమాకు దర్శకత్వం వహించారు. ఆ తరువాత నటనను కొంచెం పక్కన పెట్టి టివి, నాట్యాలపై దృష్టి పెట్టారు.

## అందాల నటి రేఖ:

ప్రతిభావంతమైన నటిగా గుర్తింపుపొందిన రేఖ మహిళా ప్రాధాన్యతగల

ఈ భర్త పాత్రను వినోద్ మెహ్రా పోషించాడు. ఈ చిత్రం ఆమెకు ఒక మైలురాయిగా కొనియాడబడింది, మరియు ఈ చిత్రంలో ఆమె నటన విమర్శకులు మరియు ప్రేక్షకులచే ప్రశంసలు పొందింది. ఆమె మొదటిసారిగా ఉత్తమ నటిగా ఫిలింఫేర్ అవార్డుకు ఎంపిక చేయబడింది. అదే సంవత్సరము, ఆమె మొదటిసారి ముకద్దర్ కా సికందర్తో కీర్తిని పొందింది, దీనిలో కూడా అమితాబచ్చన్‌నే ఆమెకు సహనటుడు.

చిత్రాలలో నటించి మంచి పేరు తెచ్చుకున్నారు. ఖూబ్ సూరత్ సినిమాలోని పాఠశాల విద్యార్థిని పాత్ర, ఖూన్ భరీ మాంగ్‌లోని నిష్కర్షయైన ప్రతీకారం తీర్చుకునే స్త్రీ వంటి పాత్రల ద్వారా రేఖ గుర్తింపు పొందింది, ఈ రెండు చిత్రాలు ఆమెకు ఫిలింఫేర్ ఉత్తమ నటి అవార్డును తెచ్చిపెట్టాయి. ఉమ్రావ్ జాన్ లోని దేవదాసి పాత్ర పోషణకుగాను ఆమెకు ఉత్తమ నటిగా జాతీయ చలన చిత్ర అవార్డు లభించింది. 1970 దశాబ్దమంతా మరియు తరువాతి కాలంలో ఆమె భారతీయ చిత్ర మాధ్యమంలో ఒక సెక్స్ సింబల్ (శృంగార నాయకి) గా గుర్తింపు పొందింది.

రేఖ తన 40 సంవత్సరాల వృత్తి జీవితంలో 180కి పైగా చిత్రాలలో నటించింది. ఎన్నోసార్లు ఆమె తన వృత్తిలో తిరిగి నిలదొక్కుకొని తన స్థానాన్ని నిలబెట్టుకోవటంలో ప్రతిభ కనబరచింది. భారత దేశంలో సమాంతర సినిమా అని పిలవబడే కళాత్మక చిత్రాలు మరియు ప్రధాన భారతీయచిత్రాలు రెండింటిలో నటించి ఆర్థికంగా విజయం సాధించటంతో పాటు సంవత్సరాల తరబడి నటించిన ఎన్నో చిత్రాలకు విమర్శకుల ప్రశంసలు పొందింది.

1976లో సహనటుడు అమితాబచ్చన్‌తో కలసి నటించిన చిత్రం దో అంజానేలో ఆమె వాంఛ గల స్త్రీ పాత్రను పోషించింది, అదే ఆమె యొక్క మొట్టమొదటి నటన ప్రాధాన్యత గల పాత్ర. ఆ చిత్రం విమర్శనాపరంగా మంచి విజయం సాధించింది, మరియు అందులోని నటనకు ఆమె మంచి గుర్తింపు పొందింది. అయితే, ఆమె యొక్క నటనా జీవితంలో గుర్తుంచుకోదగిన మలుపు 1978లో ఘర్ చిత్రంలో ఆమె పోషించిన బలాత్కార బాధితురాలుతో వచ్చింది. సామూహిక అత్యాచారంతో తీవ్రంగా బాధించబడి మరియు ప్రేమించే భర్త మూలంగా తిరిగి బలాన్ని పుంజుకొనే కొత్తగా పెళ్ళయిన యువతి ఆర్తి పాత్రను పోషించింది, ఈ భర్త పాత్రను వినోద్ మెహ్రా పోషించాడు. ఈ చిత్రం ఆమెకు ఒక మైలురాయిగా కొనియాడబడింది, మరియు ఈ చిత్రంలో ఆమె నటన విమర్శకులు మరియు ప్రేక్షకులచే ప్రశంసలు పొందింది. ఆమె మొదటిసారిగా ఉత్తమ నటిగా ఫిలింఫేర్ అవార్డుకు ఎంపిక చేయబడింది. అదే సంవత్సరము, ఆమె మొదటిసారి ముకద్దర్ కా సికందర్తో కీర్తిని పొందింది, దీనిలో కూడా అమితాబచ్చన్‌నే ఆమెకు సహనటుడు. ఆ చిత్రం ఆ సంవత్సరంలో అన్ని చిత్రాల కన్నా ఘన విజయాన్ని సాధించింది, అదేవిధంగా ఆ దశాబ్దంలో అన్నింటి కన్నా పెద్ద విజయాన్ని సాధించింది, మరియు ఆ సమయంలో రేఖ విజయవంతమైన నటిగా నిలిచింది. ఈ చిత్రం అనుకూలమైన విమర్శకుల ఆదరణతో మొదలైనది, మరియు వేశ్యగా రేఖ యొక్క అభినయనం ఆమెకు ఫిలింఫేర్ ఉత్తమ సహాయ నటి అవార్డును సాధించి పెట్టింది.

# మాల ధారణం



పానవట్టంపై కూర్చోబెట్టిన శివలింగంగా కనిపిస్తున్న అయ్యప్పస్వామి, ఎడమచేతి వయ్యారపు వంపుతో విష్ణువు మోహినీ అవతారానికి ప్రతీకగా కనిపిస్తున్నాడు. ఒంటినిండా భస్మం హరరూపాన్ని తలపిస్తుంటే, ముఖాన ఉండే తిరునామం హరిరూపాన్ని చూపిస్తుంది. మెడలోని రుద్రక్షమాల శంకరునిది అయితే, తులసిమాల శ్రీహరికి ఇష్టం అయినది. అయ్యప్పస్వామి దీక్ష శంకరునికి ఇష్టమైన కార్తీకమాసంలో ప్రారంభమై, శ్రీహరికి ఇష్టమైన మార్గశిరమాసంలో ముగుస్తుంది.

**మండల దీక్ష:** అయ్యప్ప దర్శనానికి 40 రోజులు దీక్షను పాటిస్తారు. మన శారీరక, మానసిక వ్యవస్థ భక్తితో చైతన్యం కావడానికి సుమారు 40 రోజులు పడుతుం ది. మంత్ర, దీక్ష నియమాలకు కూడా మండల కాలాన్ని నిర్ణయించారు. భారతీయ శాస్త్ర సంప్రదాయంలో మండలకాల దీక్షకు ఉన్న శక్తి అటువంటిది.

**18 మెట్ల ప్రాముఖ్యం:** అయ్యప్పస్వామి గుడికి ఉన్న పద్దెనిమిది మెట్లు, మోక్షము అనే మేడకు ఉన్న పద్దెనిమిది మెట్లు అని శాస్త్రవచనం. ఇంకా ఈ 18 మెట్లు గురించి మన పురాణాలు ఇలా చెబుతున్నాయి. ఆవాహన సమయంలో అష్టదిక్పాలకులు (8), త్రిమూర్తులు (13), వారి భార్యలు (3), ఇంద్రుడు (1), బృహస్పతి (1), ఆదిపరాశక్తి (1), సూర్యుడు (1) అంటూ మొత్తం పద్దెనిమిది మంది దివి నుండి భువికి దిగిరాగా, దేవాలయ ప్రతిష్ఠనాడు మృదంగ, భేరి, కాహళ, దుందుభి, తుంబురు, మర్దల, వీణ, వేణు, నూపుర, మట్టుక, డిండిమ, ఢమరుక, ఢక్క, దవళ, శంఖ, పటహ, జజ్జరి, జంత్ర, అనే 18 వాయిద్యాలను మ్రోగించారట.

**ఎక్కడ చూసినా శరణుఘోష:** ఎటుచూసినా శరణు ఘోష. ఊరూవాడా అయ్యప్ప భక్తులే దర్శనమిస్తు న్నారు. పవిత్ర దీక్షతో స్వామి అయ్యప్పకు ఆత్మనివేదన చేసుకుంటారు. శివుడికి ఇష్టమైన కార్తీకమాసం, విష్ణువుకు ప్రీతిపాత్రమైన ధనుర్మాసం వచ్చిందంటే చాలు, శరణమయ్యప్ప మము కావుమయ్యప్ప అంటూ భక్తకోటి శబరిమలై దిశగా అడుగులు వేస్తుంటారు. శరీరాన్నీ. మనసును చెడు నుంచి మంచి మార్గంలోకి మళ్ళించే దీక్షే స్వామి శరణమయ్యప్ప మండల దీక్ష. అందుకు అనువైనవే ఈ రెండు మాసాలు. పరిమిత కాలంలోనే అయ్యప్ప దర్శనం జరుగుతుంటుంది. దీనికి కార్తీకమే ఆద్యం. మోక్షమార్గాన్ని అన్వేషించే వారూ, సన్మార్గాన జీవనయాత్ర సాగించాలను కునేవారూ తప్పనిసరిగా జీవితకాలంలో ఒక్కసారైనా శబరిమలై యాత్ర చేయాలని ఉవ్విళ్లూరు తుంటారు.

**భక్తులకు కఠిన పరీక్షలు:** కేరళలోని పంపా నదికి చేరువన ఈ పవిత్ర కొండ (మలై) ఉంది. పశ్చిమకనుముల్లోని దట్టమైన అడవిప్రాంతంలో ఉన్న శబరిమలై భక్తుల ఆధ్యాత్మిక దాహం తీర్చే పుష్కరిణి. పంపానది నుంచి ఆలయానికి చేరే లోపు భక్తులకు అనేక పరీక్షలు తప్పవు. ఎత్తన కొండప్రాంతం, ఆపైన దట్టమైన అడవి... ఎంతటివారికైనాసరే, అయ్యప్ప దర్శనం సులు వుగా లభ్యంకాదు. **కొలిమిలో కాలితేనేకానీ లోహం మాట విననట్టే,** ఈ దేహం కూడా భగవంతుడు పెట్టే పరీక్షలో కాలాల్సిందే. దానికి దగ్గర దారిలేదు. ఈ సత్యాన్ని చాటిచేప్పేదే శబరిమలై యాత్ర. చలికాలం...మాట వినని స్థితిలో ఉన్న శరీరా న్ని లొంగదీసుకోవాలంటే, ఈ దేహచింతనను విడనాడి అలౌకికానందపుటంచులు చవిచూడాలంటే అందుకు మనము ముందు ఉన్న ఏకైక మార్గం స్వామి అయ్యప్ప మండలదీక్షే.

**ఆద్యంతం భక్తి పారవశ్యమే :** శబరిమలై యాత్ర ఆద్యంతం భక్తి పారవశ్యమే. లక్షలాది మంది భక్తులు ఎరుమేలి అనే స్థలికి చేరుకుంటారు. అక్కడ పేటతుల్లి ఆడివావరు స్వామి, పేటశాస్త్రీలను దర్శించుకుని ఆ తరువాత స్వామి సన్నిధానం చేరుతారు. పంపానది నుంచి బయలుదేరి ఇరుముడి మోసుకుంటూ కొండ అంచున ఉన్న అప్పాచిమేడుకు చేరుకుంటారు. అక్కడి నుంచి మరికొంత దూరం ప్రయాణం సాగిస్తే బహిరంగ ప్రదేశంలో శబరిపీఠం కనిపిస్తుంది. దీన్నే శ్రీరాముని కోసం శబరి నిరీక్షించిన ప్రదేశంగా చెబుతుంటారు. పంపా నదికి. సన్నిధానానికీ మధ్య ఉన్న శరంగుత్తి ఆల్‌కు భక్తులు చేరుకుంటారు. అక్కడ కన్నె స్వాములు శరంపుల్లాలను అక్కడ ఉంచుతారు. ఆ తరువాత సన్నిధానం చేరుకుని అయ్యప్పస్వామిణి దర్శించుకుంటారు.

**అద్వైత మలై :** అయ్యప్ప అవతారంలోనే ఒక విశిష్టత ఉంది. ఆయన హరిహర సుతుడు. శ్రీమన్నారాయణుడు మోహినీ అవతారంలో ఉండగా, శివ కేశవులకు జన్మించిన వాడే స్వామి అయ్యప్ప. అందుకే ఈ పుణ్యక్షేత్రంలో హరిహర బేధం లేదు. అద్వైతానికి నిలువెత్తు కొండ శబరిమలై. కలియుగంలో ప్రత్యక్షదైవం తిరుమల వెంకటేశ్వరుని తరువాత అంతటి ప్రాచుర్యం పొందిన దైవం అయ్యప్పస్వామి. అయ్యప్ప దీక్షలోని కఠోర నియమాలు, చిత్తశుద్ధి, గురుభక్తి, ఆత్మనివేదన ఈ దీక్షలోని ప్రత్యేకతలు. 41 (మండల) రోజులపాటు ఈ దీక్ష కొనసాగుతుంది. పదునెట్టాండి (18 మెట్లు) ఎక్కి స్వామివారిని దర్శించుకోవడంతో దీక్ష ముగుస్తుంది. కఠోర దీక్ష ముగియ గానే కలిగే మానసిక ఆనందం అంతా ఇంతా కాదు. మళ్ళీ ఎప్పుడు దీక్ష చేపడదా మా, మళ్ళీ అయ్యప్పస్వామిని కనులారా చూస్తామా... అంటూ పరితపిస్తుంటారు భక్తకోటి. ఇనుమును సూదంటురాయి (అయిస్కాంతం) ఆకర్షించిన రీతిలోనే అయ్యప్ప తన భక్తులను ఆకర్షిస్తుంటాడు. ***నవంబర్ 16 నుంచి జనవరి మూడు*** వరకు మండల దర్శనం, అటుపై జనవరి పది నుంచి మకర సంక్రాంతి వరకు మకరజ్యోతి దర్శనంగా పరిగణిస్తారు.

**జపమాల వైశిష్ట్యం:** మన పూజా విధానంలొ జపమాలగా ఉన్నత స్థానాన్ని పొందిన కంఠాభరణాలు తులసి, రుద్రాక్ష, చందనం, స్పటికం, పగడాలు తామర పూసల మాలలు. రుద్రాక్షలు అనేవి అ పరమేశ్వరుడు ఐన శివుని అంశ వలన ఉధ్భవించినవిగా ప్రతీక. అందువలన రుద్రాక్షల మాలలు అన్నింటిలొ శ్రేష్టమైనవిగా చెప్పుకుంటాము. రుద్రాక్షల వలన...వాటిని ధరించటం వలన మనకు చాలా మంచి ఫలితాలు అనగా భూత పిశాచ భాధలు తొలుగుతాయి.

**ఆరోగ్య రక్ష రుద్రాక్ష :** మన ఆరోగ్యానికి కూడా రుద్రాక్షలు ఎంతో మంచివి. రుద్రాక్షలు అధిక కొపాన్ని తగ్గించి బి.పిని కంట్రోల్ చేస్తాయి. ఎన్నో ఆరోగ్య సమస్యలకు మంచి ఔషధంగా పనిచేస్తుంది. తులసి మాల విష్ణుమూర్తికి ప్రతీక. ఈ మాల ధరించటం వలన శరీరంలో వేడి తగ్గుతుంది. చందన మాల శరీరానికి తా ేప ని వా రి ణి గా పనిచేస్తుంది. స్ఫటికమాల మాలిన్యాలను గ్రహిస్తుంది. పగడమాల వలన రక్తపస్రరణ బాగా జరుగుతుంది. తామర పూసల మాల చర్మ వ్యాధులను దరిచేర నివ్వదు. అందుకే ఈ పరమ పవిత్రమైన మాలలకు పూజ, అభిషేకం చేసి, ఆ మాలల యందు అ అయ్యప్ప స్వామి ని ఆవహింపచేసి వాటిని ధరించి భక్తులు అందరూ శుద్ధిగా దీక్ష తీసుకుంటారు.



మనిషిని శారీరకంగా, మానసికంగా, దృఢంగా, క్రమశిక్షణలో ఉండేందుకు ఈ అయ్యప్ప దీక్ష ఎంతో ఉపకరిస్తుంది. శరీరంలో ఉన్న సమస్త కల్మషాలను దూరంచేసి శరీరాన్ని తేలికపరిచే ఆరోగ్య విధానం అయ్యప్ప దీక్షా విధానం.

–అశోక్ స్వామి

**దీక్షలో పాటించవలసిన నియమాలు :** *దీక్షా కాలమందు బ్రహ్మచర్యము పాటించవలెను. ప్రతి దినము ఉదయము సూర్యోదయమునకు ముందు సాయంకాలము సూర్యుడు అస్తమించిన తర్వాత చన్నీటి స్నానము ఆచరించవలెను. శుభ, అశుభ కార్యములందు పాల్గొనరాదు. గురుస్వామి ఆజ్ఞలను పాటించవలెను. శాఖాహారము మాత్రమే భుజిం చవలెను. శవము ఎదురైన వెంటనే తలస్నానము చేయవలెను. మత్తు పానీయ ములు సేవించరాదు. నల్ల దుస్తులు మాత్రమే అయ్యప్పలకు శ్రేష్టము. కుల, మత బేధములు పాటించరాదు. ధూమపానము తాంబూలములు సేవించరాదు. ఇరుముడి కట్టుకొనుటకు 41 రోజుల దీక్ష పూర్తి చేసి ఉండవలెను. దీక్షా కాలములో ఏ విధమైన అనుమానం వచ్చినను గురుస్వామివారిని అడిగి తెలుసుకొనవలెను. దీక్షలో ఉన్న అయ్యప్పలు తమ శక్తి కొలది తోటి అయ్యప్పలకు ఇంటి యందు భిక్ష పెట్టవలెను. అహంకారము, ఆడంబరములు వదలి మామూలు జీవితము గడుపవలెను. ఉదయం, సాయంకాలము తప్పక శరణుఘోష చేయవలెను.*

ప్రతి అయ్యప్ప రాత్రి వేళల్లో అయ్యప్పకు పవళింపు సేవ చెయ్యాలి. ఎన్నిసార్లు అయ్యప్పను దర్శించిన వారైనా తోటి అయ్యప్పలను గౌరవించవలెను. స్త్రీలలో బాలికలు 10 సం. లోపు పెద్దలకు 50 సం.లు పైబడి వయస్సు ఉన్నవారు మాత్రమే మాలాధారనకు అర్హులు. బహిష్టు అయిన స్త్రీని చూడడం, వారి మాటలు వినడం చేయరాదు. అటుల చూచిన వెంటనే స్నానము చేసి శరణుఘోష పలుకవలెను. 41 రోజుల వ్రత దీక్షలో పూర్తిగా ఆధ్యాత్మిక చింతన అలవరుచుకొనవలెను. గోళ్ళు తీయుట, వెంట్రుకలు కత్తిరించుట చేయరాదు. ఆహారం సేవించునవుడు సాధ్యమైనంత వరకు ఉప్పు, కారం తగ్గించవలెను. భోజనము ఒక పూట మాత్రమే ( మధ్యాహ్నం ) చేయవలెను. ప్రతివారిని స్వామి అని మాత్రమే సంభోదించవలెను. పిల్లలను మణికంఠ అని సంభోదించవలెను. బాలికలను, స్త్రీలను 'మాత' అని, భార్యను 'మాలికా పురత్తమ్మ' అని సంభోదించవలెను. రాత్రి అల్పాహారం లేదా పాలు పండ్లు మాత్రమే తీసుకొనవలెను. పాదరక్షలు ధరించరాదు. చిరుతిళ్ళు తినరాదు. ఏ విధమైన చెడు అలవాట్లు ఉండరాదు. పడుకునేటప్పుడు పరుపు, దిండ్లు ఉపయోగించరాదు. చాపమీద మాత్రమే పడుకొనవలెనదీక్షలో వారు వారి ఇంటిలో ఎవరైనా మరణించిన వారి వద్దకు వెళ్ళరాదు. అటుల వెళ్ళవలసి వచ్చిన, మాలను గురుస్వామితో తీయించి స్వామి ఫొటోకి వేయవలెను. ఆ సంవత్సరము అతను శబరిమల యాత్ర చేయరాదు. స్వామి దీక్షలో ఉన్నప్పుడు పగలు ఎంత మాత్రము నిద్రించరాదు. నిరంతరం శరణుఘోష జపించవలెను. స్వామియే శరణం అయ్యప్ప అను వేదమంత్రోచ్చారణ నిరంతరము జపించవలెను. తాను చేయు ప్రతికార్యమును, ప్రతి జీవిలోను అయ్యప్ప భగవానుని దర్శించుచుండవలెను. ప్రతి స్త్రీ (భార్య సైతం) దేవి స్వరూపమే. అయ్యప్ప ఎల్లప్పుడూ విభూది, చందనం, కుంకుమ బొట్టు లతో విలసిల్లుచూ, అస్కలిత బ్రహ్మచర్యం అవలంభించవలెను. ఎదుటివారిని తన యొక్క మాటల, చేతల వలన గానీ నొప్పించక ఎల్లప్పుడూ దయ, శాంతమును కలిగి యుండవలెను.

**'మానవ సేవయే మాధవ సేవ'** అన్న సూక్తిని మరువక తోటివారికి సాధ్యమైనంత వరకు సహాయ పడుట అయ్యప్ప కర్తవ్యము. నియమ ములను క్రమం తప్పకుండా ఆచరించు భక్తులను శబరిమల సన్నిధాన మందు పదునెట్టాంబడి నెక్కు అర్హత కలుగును. భగవత్ సాక్షాత్కారము లభించును. శబరి యాత్ర ఫలితమును పొందగలరు.

**కన్నెస్వాములకు కొన్ని ముఖ్య సూచనలు :** అయ్యప్పలు వ్యర్థ ప్రసంగ ములు చేయరాదు. అయ్యప్పలు చెప్పినట్లు యాత్రలో అనుసరించవలెను. కానీ బృందాన్ని వదలి ముందుకు నడవరాదు. ఆ భక్త సమూహంలో తప్పిపోయిన గుర్తు పట్టడం చాలా కష్టమౌతుంది. ఇరుముడి నెత్తిపై పెట్టుకున్న తరువాత వెనక్కి తిరిగి చూడకూడదు. వస్తానని కానీ, వెళుతున్నాని కానీ, కుటుంబసభ్యులకు కానీ మరెవ్వరికీ చెప్పరాదు.

ఇరుముడిని శిరస్సుపై వుంచుకుని చిరుతిళ్ళు తినుట వంటివి చేయరాదు. ఇరుముడిని కన్నె అయ్యప్పలు ఎట్టి పరిస్థితులలోను దించుకొనరాదు. అవసరమైతే బృందంలోని అయ్యప్పలే ఇరుముడిని క్రిందకు దించుతారు. బృందంలోని వారు కాక యాత్ర చేసే వేరే అయ్యప్పలెవరైనా సాయం చేయవచ్చును. కన్నె అయ్యప్పలలో భక్తితో మహత్తర శక్తి నిబిడీకృతమై వుండుట వలన ఉత్సాహముతో ఉరకలు వేయడానికి మనసు ఆరాటపడుతుంది. కాని ఎట్టి పరిస్థితులలోనూ బృందాన్ని విడిచి వెళ్ళకూడదు. యాత్రలో తినిబండారాలను అందరికీ పంచి పెట్టి తినాలి.. స్వామి శరణుఘోష ను చెప్పుకుంటూ నడకను సాగించాలి. యాత్రలో మనసును అయ్యప్ప స్వామి పైనే లగ్నము చేయాలి. యాత్రలో ఆలయములు, పుణ్యక్షేత్రములు దర్శించేటప్పుడు అందరితో కలసి దర్శించవలెను. కాని వేరుగా పూజలు జరపించరాదు. అందరితో కలసి వెళ్ళాలి. ఎవరిదారిన వారు వెళ్ళకూడదు. స్నానము చేయు నవుడు విలువైన వస్తువులు, డబ్బు మిగిలినవన్నీ అందరితో బాగా పరిచయము ఉన్న అయ్యప్పలకు ఇచ్చి వెళ్ళాలి.

కన్నె అయ్యప్పస్వాములు బృందంతో కాకుండా ఎప్పు డూ యాత్ర చేయరాదు. ఒంటరిగా కూడా వెళ్ళకూ డదు. సాటి అయ్యప్ప కనిపించనప్పుడు స్వామి శరణం అని చెప్పాలి. ఎవరినీ కూడా పేరుతో పిల వకూడదు. వారి వారి పేరు చివర **'అయ్యప్ప'** అని కానీ **'స్వామి'** అని కానీ పిలవవలెను. విద్యార్థులు, ఉద్యోగస్థులు, వ్యాపారస్థులు విధి నిర్వహణలో అశ్రద్ధ చేయరాదు. పూజలకు, భజనలకు అవకాశము లేని యెడల చింతించక, వారి వారి విధులు నిర్వహిస్తూనే శరణు ఘోష మనసులో తలచుకున్నా చాలు. పూజా, భజన సమయాలలో ఒంటి మీద చొక్కా ఉంచుకోకూడదు. తువ్వాలును మాత్రం నడుముకు చుట్టుకోవాలి.

అయ్యప్పలు లుంగీ పంచను పైకి మడచి కట్టుకోరాదు. ఒక వేళ విధి నిర్వహణలో అడ్డుగా ఉంటే పైకి కట్టుకొనవచ్చును. మాలవేసినవుడు, భజన పూజ నిర్వహించునవుడు ఇరుముడి కట్టినవుడు , మాల తీయునవుడు, గురుస్వామికి అయ్యప్పలు వారి శక్తి కొలది దక్షిణ చెల్లించవలెను. అయ్యప్పలు సాటి అయ్యప్పలకు, గురుస్వాములకు, తల్లిదండ్రులకు పాద నమస్కారములు చేయవలెను. అయ్యప్పలు గుడిలోనికి వెళ్ళగానే ఒంటిపై చొక్కావిప్పి స్వామివారిని దర్శించాలి. సుబ్రహ్మణ్యస్వామిని అయ్యప్పస్వామిని విధిగా పూజించవలెను.

జీవానాం నరజన్మ దుర్లభం – సకల చరాచర జీవరాశులన్నిటికన్నా మానవుడే శ్రేష్టుడు గనుక, ఋషి అంతటి వాడవ్వాల్సిన మనిషి మసై, బూడిదై పోకూడదని, ఈ జన్మలోనే ముక్తిని పొంది మానవుడు తన జన్మను చరితార్థం చేసుకోవాలనే ఉద్దేశంతో 41 రోజులు దీక్షను ఆచరించి, ఆ దీక్షలో పొందిన ఆధ్యాత్మిక ఆనంద, అనుభవాలను మానవుడు తన జీవితకాలమంతా పొంది తద్వారా మోక్షాన్ని పొంది తరించాలన్నదే భగవంతుని ఆంతర్యం. –శ్రీనివాస్ స్వామి



మానవ జన్మకి పరమార్థం మోక్షాన్ని పొందడమే – అందువలన ఆధ్యాత్మిక సాధనలో అనుక్షణం అడ్డు తగిలే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే అరిషడ్వర్గాలని అధిగమించడం కోసమే అయ్యప్ప దీక్షను వహించాల్సి వుంది.

–శ్రీకాంత్ స్వామి

మణికంఠుడు తాను ప్రతీ యేడాది మకర సంక్రాంతి రోజున కాంతిమలపై జ్యోతి రూపంలో కనిపిస్తానని ఆ సమయంలో తనకు ఆభరణాలు అలంకరించుకొని తమ కోరిక తీర్చుకోమని తన తండ్రితో చెప్పాడు. అన్నమాట ప్రకారం ఇప్పటికీ ఆ కాంతిమలపై మకర సంక్రాంతి రోజున జ్యోతిరూపంలో దర్శనమిస్తుంటాడు.

–తులసి స్వామి

మనం సరిగ్గా గమనించినట్లైతే గనుక ప్రతీ ఏడాది కొన్ని లక్షలమంది భక్తులు మాలాధారణ చేసి నలభై రోజులు (నిజానికిది 48 రోజులు.మండలము అనగా ఒక మాసము+ఒక పక్షము+మూడు దినములు=30+15+3=48 రోజులు)దీక్షలో వుండి అయ్యప్పని దర్శిస్తూ వున్నారు.సంవత్సరంలో కనీసం రెండు నెలలు వారిని భక్తులుగా,మంచి మార్గంలో వుంచేలా చేస్తున్నది ఈ మాలాదారణే.ఈ సమయంలో క్రైమ్ రేటు కూడా చాలా తగ్గిపోతుంది అంటే దాని ప్రభావాన్ని అర్థం చేసుకోవచ్చు.మనకోసమే ఆ శభరీశుడు బ్రహ్మచారిగా ఆ శబరిగిరిపై శాశ్వతంగా ధ్యాననిమగ్నుడయ్యాడు.

–ఎం. అనీల్ కుమార్, చింతల్



# వింతలు- విడ్డూరాలు




లంబికల




మన మెదడుగుండా ప్రతి నిమిషమూ 750 మిల్లీ లీటర్ల రక్తం ప్రయాణిస్తుంది.

మన శరీరంలోని అన్ని కణాల కన్నా మెదడు లోని కణాలు ఎక్కువ కాలం జీవిస్తాయి.



Rose garden of Chandigarh

దేశంలోనే...

అతి పెద్ద గులాబీ తోట ఛండీఘడ్ లో ఉంది. 27 ఎకరాల్లో విస్తరించిన దీనిలో 1600 రకాల గులాబీ మొక్కలు 17,000 దాకా ఉన్నాయి. ఆసియాలో కూడా ఇదే పెద్దది.





బోయింగ్ 747 విమానం ఇంధన ట్యాంకు సామర్థ్యం 57,285 గ్యాలన్లు.



-Dr.Seshagirirao(Srikakulam)



నిరంతరం నేర్చుకుంటే తప్ప, ఉపాధ్యాయుడనేవాడు నిజంగా మరొకరికి విద్య నేర్పలేడు. -రవీంద్రనాథ్ ఠాగూర్

## కథ

# ఆత్మ



బండ్లోకి ఎక్కించారు.

కొమ్ము ఊదారు... డప్పులు వాయించారు... పూలు చిల్లర రూకలు బొరుగుల్లో కలిపి చల్లుతూ వెళుతుంటే... నేను పది మది నోరు కొట్టి సంపాదించిన డబ్బు... చివరికి నా శవంపై చల్లడానికి ఉపయోగపడినందుకు... నా మీద నాకే అసహ్యం వేసింది.

నా ఆస్తి ఐశ్వర్యం చూసి... పొరుగూరి మాజీ ఎమ్.ఎల్.ఎ. తన కూతుర్ని నాకిచ్చి పెళ్ళి చేసినప్పుడు... పేదల కష్టాన్ని జుర్రుకున్న డబ్బుతో ఘనంగా మా ఇద్దర్ని ఊరేగించినప్పుడు కూడా...ఇలాగే జరిగింది... ఇప్పుడు పడుకోబెట్టి...ఊరేగిస్తున్నారు...అప్పుడు కూర్చోబెట్టి ఊరేగించారు... ఛీ! భగవంతుడు రెండింటికి ఒకే విధానం పెట్టాడు.

★★★

నా శవరథం పుర వీధుల గుండా ఆర్భాటంగా ముందుకు కదులుతోంది. ఎదురుగా వస్తున్న నా శవాన్ని చూసి “భగవంతుడు ఇన్నాళ్ళకు ఒక మంచిపనిచేసాడు” అంటూ ఓ పక్క ఛీదరించుకొంటూ పక్కకు తప్పుకొని వెళుతున్న వెంకటేశ్వర్రప్రసాద్‌ను చూస్తుంటే... ఇంత బతుకు బతికి... ఇన్నాళ్ళూ బతికి నేను సాధించింది... ఛీదరింపులు. అసహ్యింపులేనా..! ఛ... బతికున్నంత కాలం కళ్ళు మూసుకొని ఇష్టానుసారం బతికేసాను. కళ్ళు మూత పడ్డాక తెలుస్తోంది. నాలోని అసలురంగు... వెంకటేశ్వర్రప్రసాద్ డబ్బే కాదు... భూమిని కూడా కబ్జా చేసాను... వాళ్ళు కంట్లో నీళ్ళు తెప్పించాను. ఉన్న ఆస్తి పోగొట్టుకొని చిన్న కంపెనీలో రెక్కల కష్టంతో జీవిస్తున్నాడు.

నన్ను పొగుడుతున్న వారందరూ నన్ను ఆశిస్తున్నవారు... తిడుతున్న వారందరూ నావల్ల నష్టపోయినవారు. ఏసీ కార్లలో, ఏసీ రూముల్లో కూర్చుని, నలుగుర్ని చుట్టూ కాపలా పెట్టుకొని, పొట్ట పెంచుతూ... కూర్చోవడమే జీవితం అనుకున్నాను. బ్రతికినంతకాలం పార్టీ పనుల్లో బిజీ... వ్యాపారంలో బిజీ... దొంగనోట్ల చలామణి దగ్గర్నుంచి... భూకబ్జాల వరకు దందా నడపడంలోనే జీవితం సంకనాకిపోయింది. మనిషికి కావల్సింది మానవత... డబ్బు వ్యాపకంలో మానవత మరిచిన మనిషి శాశ్వతంగా బ్రతికి బట్టకడతామన్నట్టు ఊహించి, సంపాదన ఆర్జనకోసం విపరీత పరిణామాలకు దారి మళ్లాడు. అర్థం వయసుపై బడింది. కానీ నాలో పదవీ వ్యామోహం, సంపాదన వ్యామోహం తగ్గలేదు.

పైగా ఒక బిక్షగాడికి కూడా అణా పైసా వేయని పాపాత్మున్ని నేను.. ఒక పేదవాడికి ఆసరాగా నిలువలేకపోయిన దౌర్భాగ్యున్ని, చుట్టూ చేరిన చీడ పురుగుల్ని మేపాను.

మాటు వేసి, కాటు వేసే విషసర్పాలకు పాలు పోసి పోషించాను. ఛీ! నాదీ ఒక బతుకేనా? ఈ శరీరం ఇన్నాళ్ళు జీవించి ఫలితమేముంది. ఏసీ కార్లో తిరుగుతూ సమాజాన్ని మరచిపోయాను. ఏసీ రూముల్లో కూర్చుని మానవత్వాన్ని మరచిపోయాను. నా ఈ శరీరాన్ని కాపాడుకున్నాను తప్ప, పేదవాడి శ్రమను గుర్తించలేకపోయాను. దేవుడు మంచిపనే చేసాడు. వ్యర్థమైన ఆ శరీరంలో నుండి ఆత్మను వేరుచేసాడు.

“దేవుడా... ఎక్కడున్నావ్..? చనిపోతే దేవుని దగ్గరకు చేరుతారంటారే... స్వర్గం లేదా నరకం అనుభవిస్తారంటారే... మరి నేనెందుకు గాలిలో మిళితం అయిపోయి... ఎటూ గాక మధ్యలో ఆగిపోయాను... నీ ధరికి దారే లేదంటావా? చెప్పు...” అలాగే గట్టిగా అంటున్నాను... ఏదీ..! నాదీ నా పిలుపు నాకే వినిపించడం లేదే..! ఔను... నేనిప్పుడు దేహం వదిలిన గాలిని... అంటే ఆత్మని.

★★★

ఒకసారి డాక్టర్ రామయ్య దగ్గరికి వెళ్ళినప్పుడు... గుండె కాస్త వీక్‌గా వుంది జాగ్రత్తగా వుండమన్నాడు. అప్పుడు నాలో భయం పుట్టింది... శరీరం వణుకు పుట్టింది. అయ్యో... నా ప్రాణం నిలుపుకోవాలి... ఎలా? ఎలా? ప్రాణం మీద తీపి ఆ సమయంలో ఆస్తులు మరిచిపోయాను. అంతస్తులు మరిచిపోయాను. భార్యా పిల్లలు, స్నేహితులు, చుట్టాన్ని చివరికి నా ఎదురుగా వున్న డాక్టర్ కూడా నాలో కలిగిన ప్రాణ భయానికి కనపడలేదు.

అంతా బాగుంటే అందరూ కావాలి. అన్నిటికన్నా మిన్న డబ్బు కావాలి. ఆస్తి గొడవలు, ఉన్నత పదవులకై పీకులాటలు. ఒకటేమిటి శరీరం అలసిపోయేదాకా పోరాడతాం... నాకు అడ్డొచ్చిన వాళ్ళని చంపించి, ఆడబిడ్డల పసుపు కుంకాల్ని తుడిపేసాను. పాపం అనుకోలేదు. పైసలు కావాలనుకున్నాను. ఒక్కొక్కటి స్ఫురణతో... శూన్యంలో తేలియాడుతున్నాను. నీకు ఈ భూమితో సంబంధం తెగిపోయింది. ఆ దేహంతో బంధం వీడిపోయింది. గాలితో కూడిన ఆత్మతో గాలిలో గాలినై తిరుగుతున్నాను. డబ్బు వ్యామోహంలో పడి నా కాంట్రాక్ట్‌కు అడ్డొచ్చిన ఒకతనికి వార్నింగ్ ఇవ్వడానికి, కోపంగా బయలుదేరిన పాపానికి, నేలను విడిచి నింగిలో చేరాల్సిన పరిస్థితి వచ్చింది. డ్రైవర్‌ని ఇంటి దగ్గరే పెట్టి నేనే చాలా స్పీడుగా బయలుదేరాను.

సంపద వ్యామోహంలో నాకేదీ కనిపించలేదు... వెళ్తూ వెళ్తూ డివైడర్‌కి కారు వెళ్ళి బలంగా గుద్దుకుంది... అంతే! ఏం జరిగిందో తెలీదు. ఇలా శూన్యంలో నిలిచిపోయి... నా శవాన్ని చూడాల్సి వచ్చింది. ఆర్భాటంగా తీసుకెళ్ళిన నా శవాన్ని గుంతలో పరుండబెట్టి ఒక్కొక్కరు తలా పిడికెడు మన్ను వేసారు... అంతే... అంతటితో నా రూపురేఖలు ఈ భూమ్మీద మాసిపోయాయి... ఆరువందల ఎకరాలకు భూ స్వామినైన నాకు,చివరికి ఆరడుగుల నేల స్థిరమైనందుకు నాలో నేనే సిగ్గుపడి... గాల్లోకి మిళితయ్యాను.

శవంపై చల్లడానికి ఉపయోగపడినందుకు... నా మీద నాకే అసహ్యం వేసింది.

నా ఆస్తి ఐశ్వర్యం చూసి... పొరుగూరి మాజీ ఎమ్.ఎల్.ఎ. తన కూతుర్ని నాకిచ్చి పెళ్ళి చేసినప్పుడు... పేదల కష్టాన్ని జుర్రుకున్న డబ్బుతో ఘనంగా మా ఇద్దర్ని ఊరేగించినప్పుడు కూడా...ఇలాగే జరిగింది... ఇప్పుడు పడుకోబెట్టి...ఊరేగిస్తున్నారు...అప్పుడు కూర్చోబెట్టి ఊరేగించారు... ఛీ! భగవంతుడు రెండింటికి ఒకే విధానం పెట్టాడు.

★★★

నా శవరథం పుర వీధుల గుండా ఆర్భాటంగా ముందుకు కదులుతోంది. ఎదురుగా వస్తున్న నా శవాన్ని చూసి “భగవంతుడు ఇన్నాళ్ళకు ఒక మంచిపనిచేసాడు” అంటూ ఓ పక్క ఛీదరించుకొంటూ పక్కకు తప్పుకొని వెళుతున్న వెంకటేశ్వర్రప్రసాద్‌ను చూస్తుంటే... ఇంత బతుకు బతికి... ఇన్నాళ్ళూ బతికి నేను సాధించింది... ఛీదరింపులు. అసహ్యింపులేనా..! ఛ... బతికున్నంత కాలం కళ్ళు మూసుకొని ఇష్టానుసారం బతికేసాను. కళ్ళు మూత పడ్డాక తెలుస్తోంది. నాలోని అసలురంగు... వెంకటేశ్వర్రప్రసాద్ డబ్బేకాదు... భూమిని కూడా కబ్జా చేసాను... వాళ్ళు కంట్లో నీళ్ళు తెప్పించాను. ఉన్న ఆస్తి పోగొట్టుకొని చిన్న కంపెనీలో రెక్కల కష్టంతో జీవిస్తున్నాడు.

నన్ను పొగుడుతున్న వారందరూ నన్ను ఆశిస్తున్నవారు... తిడుతున్న వారందరూ నావల్ల నష్టపోయినవారు. ఏసీ కార్లలో, ఏసీ రూముల్లో కూర్చుని, నలుగుర్ని చుట్టూ కాపలా పెట్టుకొని, పొట్ట పెంచుతూ... కూర్చోవడమే జీవితం అనుకున్నాను. బ్రతికినంతకాలం పార్టీ పనుల్లో బిజీ... వ్యాపారంలో బిజీ... దొంగనోట్ల చలామణి దగ్గర్నుంచి... భూకబ్జాల వరకు దందా నడపడంలోనే జీవితం సంకనాకిపోయింది.

మనిషికి కావల్సింది మానవత... డబ్బు వ్యాపకంలో మానవత మరిచిన మనిషి శాశ్వతంగా బ్రతికి బట్టకడతామన్నట్టు ఊహించి, సంపాదన ఆర్జనకోసం విపరీత పరిణామాలకు దారి మళ్లాడు. అర్థం వయసుపై బడింది. కానీ నాలో పదవీ వ్యామోహం, సంపాదన వ్యామోహం తగ్గలేదు.

పైగా ఒక బిక్షగాడికి కూడా అణా పైసా వేయని పాపాత్మున్ని నేను.. ఒక పేదవాడికి ఆసరాగా నిలువలేకపోయిన దౌర్భాగ్యున్ని, చుట్టూ చేరిన చీడ పురుగుల్ని మేపాను.

మాటు వేసి, కాటు వేసే విషసర్పాలకు పాలు పోసి పోషించాను. ఛీ! నాదీ ఒక బతుకేనా? ఈ శరీరం ఇన్నాళ్ళు జీవించి ఫలితమేముంది. ఏసీ కార్లో తిరుగుతూ సమాజాన్ని మరచిపోయాను. ఏసీ రూముల్లో కూర్చుని మానవత్వాన్ని మరచిపోయాను. నా ఈ శరీరాన్ని కాపాడుకున్నాను తప్ప, పేదవాడి శ్రమను గుర్తించలేకపోయాను. దేవుడు మంచి పనే చేసాడు. వ్యర్థమైన ఆ శరీరంలో నుండి ఆత్మను వేరుచేసాడు.

“దేవుడా... ఎక్కడున్నావ్..? చనిపోతే దేవుని దగ్గరకు చేరుతారంటారే... స్వర్గం లేదా నరకం అనుభవిస్తారంటారే... మరి నేనెందుకు గాలిలో మిళితం అయిపోయి... ఎటూ గాక మధ్యలో ఆగిపోయాను... నీ ధరికి దారే లేదంటావా? చెప్పు...” అలాగే గట్టిగా అంటున్నాను... ఏదీ..! నాదీ నా పిలుపు నాకే వినిపించడం లేదే..! ఔను... నేనిప్పుడు దేహం వదిలిన గాలిని... అంటే ఆత్మని.

★★★

ఒకసారి డాక్టర్ రామయ్య దగ్గరికి వెళ్ళినప్పుడు... గుండె కాస్త వీక్‌గా వుంది జాగ్రత్తగా వుండమన్నాడు. అప్పుడు నాలో భయం పుట్టింది... శరీరం వణుకు పుట్టింది. అయ్యో... నా ప్రాణం నిలుపుకోవాలి... ఎలా? ఎలా? ప్రాణం మీద తీపి ఆ సమయంలో ఆస్తులు మరిచిపోయాను. అంతస్తులు మరిచిపోయాను. భార్యా పిల్లలు, స్నేహితులు, చుట్టాన్ని చివరికి నా ఎదురుగా వున్న డాక్టర్ కూడా నాలో కలిగిన ప్రాణ భయానికి కనపడలేదు.

అంతా బాగుంటే అందరూ కావాలి. అన్నిటికన్నా మిన్న డబ్బు కావాలి. ఆస్తి గొడవలు, ఉన్నత పదవులకై పీకులాటలు. ఒకటేమిటి శరీరం అలసిపోయేదాకా పోరాడతాం... నాకు అడ్డొచ్చిన వాళ్ళని చంపించి, ఆడబిడ్డల పసుపుకుంకాల్ని తుడిపేసాను. పాపం అనుకోలేదు. పైసలు కావాలనుకున్నాను. ఒక్కొక్కటి స్ఫురణతో... శూన్యంలో తేలియాడుతున్నాను. నీకు ఈ భూమితో సంబంధం తెగిపోయింది. ఆ దేహంతో బంధం వీడిపోయింది. గాలితో కూడిన ఆత్మతో గాలిలో గాలినై తిరుగుతున్నాను. డబ్బు వ్యామోహంలో పడి నా కాంట్రాక్ట్‌కు అడ్డొచ్చిన ఒకతనికి వార్నింగ్ ఇవ్వడానికి, కోపంగా బయలుదేరిన పాపానికి, నేలను విడిచి నింగిలో చేరాల్సిన పరిస్థితి వచ్చింది. డ్రైవర్‌ని ఇంటి దగ్గరే పెట్టి నేనే చాలా స్పీడుగా బయలుదేరాను.

సంపద వ్యామోహంలో నాకేదీ కనిపించలేదు... వెళ్తూ వెళ్తూ డివైడర్‌కి కారు వెళ్ళి బలంగా గుద్దుకుంది... అంతే! ఏం జరిగిందో తెలీదు. ఇలా శూన్యంలో నిలిచిపోయి... నా శవాన్ని చూడాల్సి వచ్చింది. ఆర్భాటంగా తీసుకెళ్ళిన నా శవాన్ని గుంతలో పరుండబెట్టి ఒక్కొక్కరు తలా పిడికెడు మన్ను వేసారు... అంతే... అంతటితో నా రూపురేఖలు ఈ భూమ్మీద మాసిపోయాయి... ఆరువందల ఎకరాలకు భూ స్వామినైన నాకు,చివరికి ఆరడుగుల నేల స్థిరమైనందుకు నాలో నేనే సిగ్గుపడి... గాల్లోకి మిళితయ్యాను.

– రేణుక

# సూర్య బుడత




## దారి కనుక్కోండి




# శ్రమలో సుఖం

ఒకనాడు అక్బర్ పాదుషా తన మంత్రి బీర్బల్ తో కలిసి వేటకు బయలుదేరాడు. అది చలికాలం. చలి విపరీతంగా ఉంది. కొంతదూరం వెళ్ళిన తర్వాత వాళ్ళ కు మార్గం ప్రక్కన ఒక పేదవాడు పడుకుని కనిపిం చాడు. ఆ మనిషి శరీరం మీద ఒక చిరిగిన అంగీ తప్ప మరే వస్త్రం లేదు.

అక్బర్ ఆ మనిషిని పరీక్షగా చూసి, బీర్బల్!ఈ వ్యక్తి మరణించినట్లున్నాడు కదూ? అని ప్రశ్నించాడు. బీర్బల్ ఆ వ్యక్తి దగ్గరకు వెళ్ళి పరీక్షగా చూసి, లేదు ప్రభూ! ఈ వ్యక్తి మరణించలేదు. ఆదమరచి నిద్రపోతున్నాడు, అన్నాడు.

బీర్బల్ మాటలపై అక్బర్‌కి నమ్మకం కలుగలేదు. ఎవరికైనా నిద్రపడుతుందా? క్రింద పరుపులేదు. కప్పుకోవడానికి కంబళిలేదు క్రింద రాళ్ళు, రప్పలు, పైన చలి యింత చలిలో విశ్రాంతిగా నిద్రించడం కేవలం ధనికులకే సాధ్యపడుతుంది. ఇతడు నిశ్చయంగా మరణించాడు అన్నాడు.

లేదు ప్రభూ! ఇతను మంచి నిద్రలో ఉన్నాడు. ఇటువంటి నిద్ర మీకూ, నాకూ కూడా పట్టదు చెప్పాడు బీర్బల్.

అక్బర్ ఆ వ్యక్తి దగ్గరకు వెళ్ళి పరిశీలనగా చూశాడు. ఆ మనిషి గాఢనిద్రలో ఉన్నట్లుగా గ్రహిం చి ఆశ్చర్యపోయాడు. ఆయన బీర్బల్‌తో బీర్బల్! నువ్వన్నట్లుగానే ఈ వ్యక్తి గాఢనిద్రలో ఉన్నాడు. కానీ యితనికి ఈ రాళ్ళ మీద యింత చలిలో ఎలా నిద్ర పట్టిందో నాకు అర్థం కావడం లేదు అన్నాడు.

జహాపనా! ధనికుడై ఉండడానికి నిద్ర పట్టడానికి ఏమీసంబంధంలేదు. నిద్ర కష్టపడితేనే వస్తుంది. ఈ పేదవాడు కష్టపడి పని చేసి అలసిపోయాడు అందువల్లనే యితనికి గాఢనిద్ర పట్టింది. ఇటువంటి సుఖనిద్ర కష్టపడితేనే లభిస్తుంది అన్నాడు బీర్బల్ .



బీర్బల్ మాటలపై అక్బర్‌కు నమ్మకం కలుగలేదు. అది కాదు బీర్బల్ ఈ వ్యక్తికి ధనవంతుల ఆహార పానీయాలూ, నిద్రపోవడానికి హంసతూలికా తల్పాలు వుంటే ఇతడు ఇంతకంటే గా ఢంగా నిద్రపోగలడన్నాడు. హుజూర్! మీరు అన్న మాటలు నిజంకావు. కావాలం టే ఇతనిని కొంతకాలం ధనవంతునిగా చేసి చూడండి అన్నాడు బీర్బల్ .తన మాటలే నిజమని నిరూపించాలని నిశ్చయిం చుకున్నాడు అక్బర్ చక్రవర్తి. ఆ వ్యక్తిని నిద్ర నుండి లేపి తన వెంట రాజభవనానికి తీసుకువెళ్ళాడు. ఆ వ్యక్తి నివసించడానికి సకల సౌకర్యాలతో ఒక ప్రత్యేక భవనం ఏర్పాటుచేశాడు. రుచికరమైన ఆహార పానీయాలు, విశ్రాంతి తీసుకోవడానికి కావలసిన హంసతూలికాతల్పం వగైరా అన్ని ఏర్పాట్లు చేయిం చాడు.కష్టపడి కాయకష్టం చేసుకునే ఆ వ్యక్తికి ఆ రాజ భవనంలో తినడం విశ్రాంతి తీసుకోవడం తప్ప వేరే విధంగా పక్షంరోజులు గడిచాయి. ఒకనాడు అక్బర్ ఆ వ్యక్తిని గురించి బీర్బల్‌ని అడిగాడు.ప్రభూ! ఆ నకిలీ ధనికుడికి మూడు దినాలుగా జ్వరం అని చెప్పాడు.అక్బర్ ఉలిక్కిపడ్డాడు, అంటే అతనికి విశ్రాంతి లేదన్నమాట. ఎవరి నిర్లక్ష్యంవల్ల ఇలా జరిగింది? అని ప్రశ్నించాడు.

జహాపనా! నాలుగు రోజుల క్రితం సాయంత్రం ఈయన బండిలో కూర్చుని షికారు వెళ్ళాడు. దారిలో చలిగాలి తగిలింది. దాంతో అతనికి జలుబు చేసి జ్వరం వచ్చింది అని చేప్పాడు బీర్బల్ .

చలి నుండి రక్షించుకోడానికి ఆ సమయంలో అతని దగ్గర కంబళి లేదా? అని ప్రశ్నించాడు అక్బర్. లేకేం ప్రభూ! ఆ మనిషి మీద తమకు అపార దయ ఉంది ఇంక వస్త్రాలకు లోటేమిటి? అతని తల నుండి కాళ్ళ వరకూ ఉన్ని వస్త్రం కప్పి ఉంది. అయి నా అతనికి జలుబు చేసింన్నాడు బీర్బల్.అతనికి నిద్ర బాగా పడుతున్నది కదూ! అడిగాడు అక్బర్.ఏపూట సరైన నిద్రలేదు.హంసతూలికా తల్పం మీద విశ్రమించిన పిదపనౌకర్లు కాళ్ళుపడితే కాసేపు నిద్ర పోగలుగుతున్నాడని చెప్పాడు బీర్బల్.

ఏం? ఎందుకని?అక్కడ రోడ్డు ప్రక్కన చిరిగిన బట్టలతో పడుకున్నప్పుడు చలివేయలేదు.ఇక్కడ ఉన్ని వస్త్రం కప్పుకున్నా చలి వల్ల జలుబు చేసింది. అక్కడ అతను రాళ్ళ మీద హాయిగా నిద్రపోగలిగాడు. ఇక్కడ హంసతూలికా తల్పం మీద పడుకున్నా నిద్రపట్టడం లేదు. ఎంత ఆశ్చర్యం? విస్మయపడ్డాడు అక్బర్. దీనిలో ఆశ్చర్యపోవడానికి ఏమీలేదు ప్రభూ! అతడు పాపం ధనికుడై కష్టాల పాలయ్యాడే అన్నాడు బీర్బల్ . రాళ్ళురప్పలపై హాయిగా నిద్రించిన వ్యక్తి హంసతూ లికా తల్పం మీద నిద్రించలేకపోతున్నాడు. ఇది ధనికుడైనందు వలన కలిగిన శిక్ష.ఇంతకు ముందు ఇతడు పగలంతా కష్టపడి పనిచేసేవాడు. అందువలన అతని శరీరం ఆరోగ్యంగా ఉండేది. అతనికి మంచి నిద్రపట్టేది. ఇప్పుడు మీరు ఇతనికి విశ్రాంతినిచ్చి సుకుమారంగా తయారు చేశారు. మామూలు చలి, వేడి కూడా ఇతను ఇప్పుడు భరించలేకపోతున్నాడు అన్నాడు బీర్బల్.అక్బర్‌కు ఇప్పుడు కూడా బీర్బల్ మాటలపై నమ్మకం కలుగలేదు. ఆ రాత్రి ఆయన బీర్బల్‌ని వెంట బెట్టుకుని ఆ నకిలీ ధనవంతుడున్న భవంతికి వెళ్ళాడు.

అక్కడ ఆ వ్యక్తి మంచం మీద నిద్రపట్టక అవస్థపడుతున్నాడు. అక్బర్ ఆ వ్యక్తికి ఎందుకని నిద్రపట్టడం లేదని ప్రశ్నించాడు బీర్బల్‌ని.

జహాపనా! అతని పక్కమీద ఏదో ఉండి గుచ్చుకుంటోంది. అందుకే అతనికి నిద్ర పట్టలేదు అన్నాడు బీర్బల్.

బీర్బల్ లోపలికి వెళ్లి అతని తల్పాన్ని పరీక్షించాడు. దుప్పటి కింద ఒక ప్రత్తి గింజ కనిపించింది. దాన్ని అక్బర్‌కి చూపించి చూడండి ప్రభూ! దీని కారణంగా ఈ కొత్త ధనికుడికి నిద్రపట్టడం లేదు. ఇంతకు ముందు ఇతనికి రాళ్ళు కూడా గుచ్చు కోలేదు. ఇప్పుడు ఈ చిన్న విత్తనం ఇతనికి కష్టం కలిగింది. మీరు ఇతని చేత్తో పక్కకూడా దులపనివ్వడం లేదు. ఇది ధనికుడైనందుకు ప్రాప్తించిన శిక్ష. కష్టపడి పనిచెయ్యకపోవడమే దీనికి కారణం అని చెప్పాడు.

అప్పటికి బీర్బల్ మాటలతో ఏకీభవించాడు అక్బర్. మరునాడు ఆయన ఆ వ్యక్తిని రాజ భవనం నుండి పంపించి వేస్తూ మనుపటి వలే కష్టపడి శ్రమించి సుఖంగా జీవించమని చెప్పాడు.

| | | |
|---|---|---|
| రివ్వున ఎగిరే<br>పిట్టల మండీ!<br>స్వేచ్ఛగా తిరిగే<br>పిల్లల మండీ!<br>మతాలు భాషలు<br>వేరుగా ఉన్నా<br>అందరూ మాకూ<br>ఒకటే నండీ! | ఆచారాలు<br>ఎన్ని ఉన్ననూ<br>మంచి వాటికే<br>ఆదరణండీ!<br>పల్లె పల్లెకు<br>పోవుదుమండీ<br>నగరాలన్నీ<br>చుట్టెదమండీ! | శాంతి వచనాలు<br>చెప్పెదమండీ!<br>సమైక్యతను<br>చాటెదమండీ!<br>కలిసుంటేనే<br>కలదు సుఖమనీ<br>వాడవాడనా<br>చెప్పెదమండీ! |

## రంగులు వేయండి




## తేడాలు గుర్తించండి







పిసినిగొట్టు వాడు పేదవాడుగా కనిపిస్తూ అమిత ధనవంతుడవుతాడు. విలాస పురుషుడు ధనవంతుడిగా కనిపిస్తూనే పేదవాడవుతాడు. -గన్‌స్టన్

వాత్సాయన

# ప్రేమలో పడితే



**షీలా,జానీ ఈ తరం ప్రేమికులు. ప్రేమించడంలో కూడా తరాలు ఉంటాయా అని ప్రశ్నించుకుంటే...అవుననే సమాధానం వస్తుంది. అదేమంటే పెద్దవాళ్లు మా తరంలో అయితేనా...అంటూ దీర్ఘాలు తీస్తారు. ఎప్పటి తరానికి అనుగుణంగా అప్పటి జనాలు కాలానుగుణంగా ప్రేమిస్తునే ఉన్నారు...ప్రేమించబడుతూనే ఉన్నారు. ఇందులో ప్రధాన వస్తువు మాత్రం ప్రేమే..అయితే దానికి సరికొత్త టెక్నాలజీని జతచేసి మరీ చూపిస్తున్నారు. నేటి ఆధునిక ప్రేమికులు. అయితే ఇటువంటి ప్రేమపెళ్లిళ్లు...ఎంతవరకు హర్షణీయమంటే...**

ఇంటర్‌నెట్ పుణ్యమా అని షీలా,జానీల పరిచయం ప్రేమగా మారింది. ప్రేమ కాస్తా ముదిరి పెళ్లిదాకా వచ్చింది. అంతదాకా బాగానే ఉంది. అయితే ఈ మధ్యన ఇటువంటి టెక్నాలజీ ఉపయోగించి పెళ్లిచేసుకున్నాడు ఓ ప్రబుద్ధుడు...తనొక సాఫ్ట్‌వేర్ ఉద్యోగిని అంటూ నకిలీ ఐడెంటిటీ కార్డులు కూడా చూపించి మరీ పెళ్లిచేసుకున్నాడు. ఆ తర్వాత ఫారిన్ అని ఇదని...ఆమె పుట్టింటివారినుంచి డబ్బులు గుంజి...చివరకు ఆ అమ్మాయిని ఒంటరిదాన్ని చేసి దాదాపు 10 లక్షల నగదు...నగలతో ఉడాయించేశాడు. మళ్లీ వేరే ప్రాంతం చేరుకుని పేరు మార్చుకుని అక్కడ కూడా ఇటువంటి దుకాణమే ఓపెన్ చేశాడు. దీనికి కావలసిన పెట్టుబడి కేవలం అతి తెలివితేటలే. వీళ్ల దగ్గర రకరకాల కంపెనీలకు సంబంధించిన ఐడి కార్డులు, అపాయింట్‌మెంట్ ఆర్డర్లు...అవసరం అనుకుంటే ఆ సంస్థలో కొందరితో పరిచయాలు...ఉండటానికి ఒక అపార్ట్‌మెంట్ సొంతంగా కూడా కొనుక్కుంటారు. మళ్లీ ఇక్కడ దుకాణం కట్టేసేముందు ఆ ఇల్లు వేరే వాళ్లకి అమ్మేసి...రాత్రికి రాత్రే ఉడాయించేస్తుంటారు.

ఇంకొక సంఘటనలో మహేష్‌కు ఒక అందమైన...తెలివైన ఒక అమ్మాయి ఇంటర్‌నెట్‌లో పరిచయం అయింది. ఆమె నెట్‌లో తన భర్త ఎంతో దుర్మార్గుడని...శాడిస్టని...అతనిని వదిలి మహేష్‌తో కలిసి ఉంటానని...ఒక వేళ మహేష్‌కు పెళ్లయి ఉంటే కూడా ఎటువంటి ఇబ్బంది కలిగించనని...కేవలం సహజీవనం సాగిస్తానని...ఏదైనా అతను చేసే కంపెనీలో ఉద్యోగం ఉంటే ఇప్పించమని...అలా మొదలైన ప్రస్థానం...చివరికి ఇద్దరూ కలిసి సరదాగా సినిమాలు...షికార్లు చేసే స్థాయికి వచ్చింది. ఒక రోజు మహేష్ తన ఇంట్లో వాళ్లు ఎవరూ లేని సమయంలో ఆమెను తన ఇంటికి రమ్మన్నాడు. ఏం జరిగిందో తెలియదుగానీ...మహేష్ మాత్రం తెల్లవార్లూ మత్తులో ఉన్నాడు. లేచి చూసుకుంటే విలువైన వస్తువులన్నీ కూడా మాయమయ్యాయి.

ఈ మధ్య ఓ అత్యుత్సాహం గల యువ జంట ఇద్దరూ కలిసి ఓ పథకం పన్నారు. అదేమిటంటే...మొగుడు తన భార్య ఫొటో నెట్‌లో చూపించి...ఈమెతో స్నేహం చేయాలని ఉందా...అంటూ మీరు నిత్యజీవితంలో విసిగి వేసారి ఉంటారు. ఒక్కసారి మీరు స్నేహం చేయాలని ఉంటే...ఈమెను ఇలా కాంటాక్ట్ చేయండి...అంటూ మెయిల్ ఇచ్చాడు. అది చూసి రాజస్థాన్‌లో ఓ వృద్ధ ప్రొఫెసర్ మనసు పీకి...అక్కడినుండి హైదరాబాద్‌కు ఆదరాబాదరాగా వచ్చేశాడు. వచ్చిందే తడవుగా ఆమె భర్త అతనిని మర్యాదగా రిసీవ్ చేసుకున్నాడు. ఉండటానికి రూమ్ ఎరేంజ్ చేశాడు. హోటల్‌లో బుక్ చేసిన రూమ్‌లో తన భార్యను కూడా తీసుకువచ్చాడు. ఇంకేం ఆమెను చూసిన ఆనందంలో మన వృద్ధ ప్రొఫెసర్ మనసు ఉప్పొంగింది. వెంట తెచ్చుకున్న ల్యాప్‌టాప్..సూట్‌కేస్ అన్నీ రూమ్‌లో పెట్టుకుని హాయిగా స్నానం చేశాడు. ఆ తర్వాత ఆమె భర్త అతనిని తన భార్య ఉంటుందని చెప్పి ప్రొఫెసర్‌ను వెంటబెట్టుకుని బయటకు షాపింగ్ చేసి వద్దామని వచ్చారు. గంటసేపు అక్కడ...ఇక్కడ...తిప్పి జనం మధ్యలోనుంచి ఆమె భర్త ఉడాయించేశాడు. విషయం తెలియని ప్రొఫెసర్ ఎక్కడికి పోతాడులే అనుకుని మళ్లీ ఆటోలో తను దిగిన హోటల్‌కి వచ్చి చూసుకునేసరికి లోపల పెట్టిన వస్తువులు ఏవీ లేవు. ఆమె కూడా లేదు. కింద హోటల్ వారికి తాను మోసపోయానని...తన సూట్‌కేసులో డబ్బులు కూడా ఉన్నాయని చెప్పడంతో...హోటల్‌వాళ్లు ఏర్పాటు చేసిన సిసి కెమెరాల సహాయంతో చివరికి ఈ హైటెక్ మోసపు యువజంటను పోలీసుల సాయంతో పట్టుకోగలిగారు. అయితే ఇలా నిత్యం మనకు ఎన్నో మోసాలు తెలియకుండానే జరిగిపోతున్నాయి. అందుకని...పెరిగిన టెక్నాలజీని చూసి ఆనందించాలో...ఈజీగా మోసపోతున్నామో బాధపడాలో కూడా తెలియని పరిస్థితిలో ఉన్నాము. అందుకే నేటి యువత ఈ నెట్ మాయలో పడకుండా జాగ్రత్తగా ఉండటం మంచిది.



---

తూర్పు-పడమర

# కోళ్ల ఫారాలకు వాస్తు

కోళ్ల ఫారాలకు తప్పని సరిగా వాస్తు వర్తిస్తుంది. ఎలాంటి భూమిలో మనం కోళ్లఫారాల నిర్మాణం చేస్తున్నామన్నది ముఖ్యం. కోళ్లకు ఒక ఆరోగ్యకరమైన వెచ్చదనం వాటికి ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. ఒక కోళ్ల ఫారానికి మరోక కోళ్ల ఫారానికి కనీస పక్షం 80 అడుగుల దూరమైనా ఎడం వదలాల్సిన అవసరం ఉంటుంది. షెడ్డును దిశకు నిర్మాణం జరిపినప్పుడే వాటి అభివృద్ధిలో కీలకమైన విజయా లను మనం అందుకుంటాం. అలాగే అవి నిర్మించే టువంటి ఎత్తు వాటి పొడవులు, వెడల్పులు, చాలా క్రమశిక్షణతో కూడినటువంటి శాస్త్రీయ సూత్రాల పైన ఆధారపడి ఉంటాయి. కాబట్టి కోళ్ల ఫారాలకు వాస్తు తప్పనిసరిగా వర్తిస్తుంది. సరియైన విధానంలో సరియైన కొలతలతో మనం నిర్మాణం చేసుకోవలసిన అవసరం ఉంది.

**ఉన్న ఇంట్లో తప్పులు ఉన్నపుడు కొత్త ఇళ్లు కట్టుకోవచ్చా**

గృహ శుద్ధిలేకుండా నూతనగృహా నిర్మాణం చేయకూడదు అనేది వాస్తు సూత్రాలలో ప్రధాన మైనది. మనం ఉండేటువంటి గృహంలో వాస్తు సంపదలేకుంటే నూతన గృహా సంపద చేతికి అందదు అనేది అనేక గృహ నిర్మాణ కర్తల అనుభవం సత్యం.

చాలా మంది తామున్న గృహాల గురించి పట్టించుకోకుండా కొత్త ఇళ్లను ప్రారంభిస్తూ ఉంటారు.తద్వారా కట్టే ఇళ్లలో తప్పులు చేయడం, ఆ తప్పులు సవరించుకోలేక పోవడం సకాలంలో డబ్బులు చేతికందక పోవడం, పనివాళ్లు రాకపోవడం, కొన్ని గృహసంబంధించిన వస్తువులు లభించక పోవడం తద్వారా గృహా నిర్మాణం పని పెండింగ్ అవడం జరుగుతూ ఉంటుంది.



**బాత్రూమ్‌లకు పైన సజ్జలు** : ఇళ్లల్లో ఉండే టాయిలేట్స్ పైన సజ్జలు వేస్తూ ఉంటారు. అవి ముఖ్యంగా కామన్ బాత్రుమ్‌లపైన మాత్రమే సజ్జలు వేసుకోవచ్చు. పడకగదిలో అంటే నైరుతి పడక గదిలో ఉండే టాయిలెట్ పైన లోరూఫ్ వేసుకోవద్దు. హాలులో ఉండే బాత్రుమ్‌పైన సజ్జలు వేసుకోవచ్చు. ఆ సజ్జలు 7 ఫీట్ల పైన ఉండాలి.

ఆ సజ్జల మీదకు వెళ్లడానికి పడక గదిలోనుంచి కాకుండా హాలులోనుంచి, కిచెన్‌లోనుండి వెళ్ళే ఏర్పా టు చేసుకోవచ్చు. సహజంగా కామన్ టాయిలెట్ పడ మరలో కాని దక్షిణంలో కాని రావాలి. అలాంటి వాటికి సజ్జలు ఏర్పాటు చేసుకుంటే అనుకూలంగా ఉంటా యి. ఇంట్లో సానుకూల వాతావరణం ఏర్పడుతుంది.

**పోర్టికో ఎలా కట్టుకోవాలి** పోర్టికోలు చాలామంది క్యాంట్‌లివర్ ఎత్తులో తీసుకుని కట్టుకుంటూ ఉంటారు. ఇది పాత పద్దతిగా అమలులో ఉంది. కాని దానివల్ల గూటిలో చీకటి వచ్చే అవకాశం ఉంది. వాస్తుపరంగా అది ఒక ప్రతికూల వాతావరణాన్ని కలిగిస్తుంది. అలా కాకుండా పోర్టుకో పొడవులో కావలసినంతగా తూర్పు ఈశాన్యంలో స్లాబ్‌ని ముందుకుతీసుకుని ఆ బాల్కానినీ ఎల్ ఆకారంలో ఆ బాల్కనీ కింద ఫిల్లర్స్ లేకుండా భీముల ఆధారంతో ఫోర్టికోను ఏర్పాటు చేసుకోవచ్చు.



## జాతకం

నా ఆర్థిక పరిస్థితి ఏం బాగోలేదు. గత నాలుగు నెలలుగా శాలరీ, నా ఉద్యోగ స్థితి ఎలావుం టుంది? భవిష్యత్తులో వేరే ఉద్యోగం దొరుకు తుందా?

– కె. లక్ష్మీ కుమార్, నెల్లూరు

మీరు ఇపుడున్న జాబ్‌లోనే కొంతకాలం ఉం డండి. 2014 నవంబర్ తర్వాత మార్పుం టుంది. ఈ సంవత్సరం సెప్టెంబర్ నుంచి బాగా నే ఉంటుంది.

ఏమైనా ఈశాన్య దోషాలుంటే సరిచేసుకోగలరు. వేలుకి రత్నాలేమైనా ఉంటే కొన్ని రోజులు తీసెయ్యడం చాలా మంచిది. ప్రతి మంగళవారం దేవాలయ సందర్శన చేయండి. 21 వారాలలో మంచి ఫలితాలుంటాయి.

★★★

మేడమ్, నాకు ఉద్యోగం ఎప్పుడు దొరుకు తుంది?

– వెంకట్, ఏలూరు

మీకు ప్రస్తుతం ఏలిన నాటి శని దశ నడుస్తు న్నది. అయినప్పటికీ ఈసంవత్సరం కన్నా వచ్చే సంవత్సరం ఫలితాలు బాగుంటాయి. పరిహారాలు పాటిస్తే అన్ని విధాలా మంచిది.

# తూర్పు ముఖమున్న ఇల్లు సరికాదు

తూర్పు ముఖమున్న ఇల్లు మీకు సరిపడదు. వీలైనంత వరకు మీ కార్యక్రమాలు 'పడమర' వైపు అయితే మంచిది. మీకు పడమర, ఉత్తరం పనికి వస్తాయి. ఇంద్రనీలం (1 కేరట్‌పైన) కుడిచేతి మధ్య వేలుకి ధరించండి. ప్రతి ఆదివారం దేవాలయ సందర్శన. సూర్య నమస్కారాలు చాలా మేలు. అరుణ, ఆదిత్య హృదయ పారాయణ మంచిది.

★★★

నా డేట్ ఆఫ్ బర్త్ తెలియదు. నేను కోరుకున్న నెంబర్ 99. నేను ఏ పని చేసినా కలిసి రావడం లేదు. ప్రతి విషయంలో ఆటంకాలు ఎదురవు తున్నాయి. రావలసిన డబ్బులు రావడం లేదు. ఏం చేస్తే నాకు కలిసివస్తుందో చెప్పండి.

– మద్దినేని అంకమ్మ చౌదరి

మీరు అడిగిన దాని ప్రకారం నడుస్తున్న సమయంలో తీవ్ర ఆటం కాలున్నాయి. చివరి క్షణంలో ఆశాభంగాలు వస్తున్నా యి. కొన్ని పరిహారాలు పాటించండి. ప్రతి గురువా రం, శనివారం దేవాలయ సందర్శన, శనివార నియమం, శనికి సంబంధించి 'నువ్వులు' దానం. రత్నా లు ధరించనవసరం లేదు. కొత్తగా ఇక ముందు ఎవరికీ అప్పులు ఇవ్వొద్దు. ఆరు వారాల పాటు ప్రతి గురువారం ఆవుకి అరటిపండు పెట్టండి.

కొన్ని పరిహారాలు పాటించడం మేలు. 'సుమంతో సుమంతో కార్తవీర్యార్జునాయనమః' అనే మంత్రాన్ని రోజూ గంటసేపు జపించడం మేలు. ఏ రకమైన రత్నం ధరించవద్దు కొన్ని రోజులు. ప్రతి బుధవారం దేవాలయ సంద ర్శన మంచిది. వచ్చే సంవత్సరం నవంబర్ నుంచి రవి ప్రవేశం వలన స్థలమార్పు కూడా ఉంటుంది.

★★★

నాకు ఉద్యోగం ఎప్పుడు దొరుకుతుంది? ప్రయివేటు ఉద్యోగం దొరుకుతుందా లేక ప్రభుత్వ ఉద్యోగం వస్తుందా?

– పింగళి శ్రీనివాస్, విజయవాడ

గవర్నమెంట్ జాబ్ అవకాశాలు కొంచెం సుమా రుగా ఉన్నాయి. ఏ జాబ్ చేసినా మంచిదే చేసే అవకాశాలున్నాయి ముందు ముందు. అందుకు కొన్ని పరిహారాలు పాటించడం మేలు. ఉగాది సమయానికి వృత్తి, వివాహం వరుసగా సూచింపబడుతున్నాయి.

పరిహారాలు...

ఉండే ఇల్లు ఎట్టి పరిస్థితుల్లో వాయువ్య ముఖం (పశ్చిమ /ఉత్తరం) కాకూడదు. అలాగే వాయు వ్యంలో ఎలాంటి దోషాలు ఉండరాదు. బహుశా మీరుండే ఇంటికి ఈ రకమైన దోషా లు ఉంటే చూసుకోండి. వేలుకి 'ము త్యం' పనికిరాదు. కుడిచేతి ఉంగరం వే లుకి కెంపు, చూపుడు వేలుకి కనకపుష్య రాగం కలిపి ధరించండి. తూర్పు, ఈశాన్యం మీకు బాగుంటాయి.

★★★

నా పుట్టిన తేదీ సరిగా తెలియదు. నేను 1996లో ఎంపీసీ పూర్తి చేశాను. ఇప్ప టికీ ఉద్యోగ స్థిరత్వం లేదు. తీవ్రమైన ఆర్థిక ఇబ్బందులతో బాధపడుతున్నాను. ప్రస్తుతం ఓ చిన్న కంపెనీలో తక్కువ శాలరీకి పని చే స్తు న్నా ను. నాకు పర్మినెంట్ ఉద్యో గం ఎ ప్పు డు లభిస్తుంది.



– జి.రామ్మోహన్

లేని వారికి దానము ఇస్తు న్నట్లుగా భా వన చేయండి. వీలైతే పంచదార, బియ్యం పిండి కలిపి ఇంట్లో ఎక్కడన్నా కనీసం కొన్ని రోజులు చీమలకు ఆహార పదార్థంగా అందించండి. 'శ్రీరాజమాతంగ్యైనమః' మంత్రాన్ని ప్రతి రోజు కనీసం గంట పఠించండి. ఇంట్లో

మీ సందేహాలని క్లుప్తంగా (మనిషికి 1 ప్రశ్న మాత్రమే) ఈ క్రింది వివరాలు వ్రాసి పంపండి. (పుట్టిన తేదీ వివరాలు లేనివారు 108 లోగా ఒక సంఖ్య వ్రాసి పంపండి. ఇది ప్రశ్న పద్ధతి, మనిషికి ఒక్క ప్రశ్న మాత్రమే)

పేరు : ..................................

పుట్టిన తేదీ : ..................................

పుట్టిన సమయం : ..................................

పుట్టిన ఊరు (మండలం) : ..................

ప్రశ్న : ..................................

పై వివరాలతో కూడిన లెటర్‌ను ఈ క్రింది అడ్రస్‌కు పంపండి...

'జాతకం' 'సూర్య' ఆదివారం

SPR publications, Surya Soudha, Plot.No: 185, M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar, AyyappaSociety Opp: Hi-Tech City, Hyderabad - 500 072.

## 18-12-2016 నుండి 2412-2016 రాశిఫలం



మేషం:Aries( అశ్విని, భరణి, కృత్తిక – 1) :వ్యాపారా భివృద్ధి జరుగును. సంఘములో పలుకుబడి పెరుగుతుంది. ఉద్యోగస్తులకు ప్రమోషన్లు, కోరుకున్న చోటుకు బదిలీలు జరుగును. రాజకీయ రంగంలోని వారికి విశేషాభివృద్ధి కలుగును. విద్యార్థులకు ఉన్నత విద్యనభ్యసించే అవకాశం కలుగుతుంది. ఆది, సోమ, మంగళ, బుధ, గురువారములు అనుకూలిస్తాయి.



వృషభం:Taurus (కృత్తిక – 2,3,4, రోహిణి, మృగశిర – 1,2)::రాజకీయ రంగాల వారికి బాగుండును. బంధువుల సహకారం లభించును. చెడ్డవారితో చెలిమి వలన కొన్ని సమస్యలు వస్తాయి. నూతన వ్యాపారములు మొదలు పెట్టెదరు. విద్యార్థులు రాణింతురు. ఉద్యోగస్తులకు బదిలీలు జరుగును. అర్ధాష్టమ శనిగలదు. శ్రీ విష్ణువును పూజించుట మంచిది.



మిధునం: Gemini (మృగశిర –3,4 ,3,4, ఆరుద్ర, పునర్వసు–1,2,3) ఊహించని సంఘటనలు జరుగును. ఉద్యోగస్తులకు అధికారుల వేధింపులు ఉండును. నూతన స్థలములందు వృత్తి, వ్యాపారములు చేస్తారు. ప్రభుత్వ రవాణా, విద్యుత్ శాఖ లందు పనిచేయువారికి బాగుండును. దానధర్మాలు చేయుదురు. క్లబ్బులు, లాటరీ రంగాలవారికి లాభించును.



కర్కాటకం: Cancer(పునర్వసు –4, స్థల వ్యాపారస్తులు ప్రత్యర్థుల కన్నా ముందుండి లాభాలు సంపాదిస్తారు. నిరుద్యోగులు, విద్యార్థులు పోటీ పరీక్షల్లో విజయం సాధిస్తారు. ఆరోగ్య విష యంలో ప్రత్యేక శ్రద్ధ అవసరం. కోర్టు సమస్యల నుండి విముక్తి లభిస్తుంది.కుటుంబ వ్యవహారాల్లో ఇతరులు జోక్యం చేసుకుంటారు.



సింహం:Leo (మఖ, పుబ్బ, ఉత్తర –1):గృహోపకరణములు కొంటారు. పలుకుబడి సంపాదించుటకు గట్టి కృషి చేయుదురు. ప్రకటన, విద్యా రంగాల వారికి అనుకూలంగా ఉండును. విద్యార్థులు కష్టపడి చదవాలి. ముఖ్య విషయములందు నిర్ణయములు వాయిదా వేయడం మంచిది. ఏల్నాటి శని గలదు. శ్రీ విష్ణువును, వెంకటేశ్వరుని పూజించుట మంచిది. ఆది, సోమ, మంగళ వారాలు అనుకూలంగా ఉండును.



కన్య:Virgo ( ఉత్తర – 2,3,4, హస్త, చిత్త –1,2)::విద్యార్థులకు మంచి అభివృద్ధి కలుగును. రాజకీయ, సినీ, నాటక, ఇతర కళా రంగాల వారికి బాగుండును. అనుకున్న పనులు శ్రమ మీద జరుగును. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. ఆర్థికపరిస్థితి బాగుండును. శత్రువులను జయింతురు. వివాహాది శుభకార్యాలు జరుగును. బాకీలు వసూలు అగును. రైతులకు లాభదాయకం..



తుల: Libra (చిత్త –3,4, స్వాతి, విశాఖ –1,2,3)

రాజకీయ నాయకులకు పలుకుబడి పెరుగును. ఉద్యోగస్తులకు బదిలీలు, ప్రమోషన్లు లభించును. తలపెట్టిన పనులు సుఖాంతమవుతాయి. చేతి పనుల వారికి విశేష ధనలాభం కలుగును. గనులు, భూమి, రియల్ ఎస్టేట్ వ్యాపారులకు లాభించును. శుక్ర, శనివారములు అనుకూలించును.



వృశ్చికం: Scorpio (విశాఖ –4 అనూరాధ, జ్యేష్ఠ) రాజకీయ నాయకులకు బాగుండును. ధైర్యముగా, సాహసంగా ఉందురు. కొత్త స్నేహితులు పరిచయమవుతారు. గూఢచారులకు బాగుండును. వివాహాది శుభకార్యములు జరుగును. పనులు, బాధ్యతలు సకాలంలో నేరవేర్చుదురు. మంగళ, బుధ వారాలు అనుకూలం. కార్మికులకు, చేతి పనివారికి ధనలాభం కలుగును.



ధనుస్సు: Sagittarius (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ –1): వృత్తి వ్యాపారస్తులకు విశేష ధనలాభం కలుగును. వాహన లాభాలు కలుగును. నూతన గృహనిర్మాణం చేయుదురు. విద్యార్థులకు ఉన్నత విద్యనభ్యసించే అవకాశం వస్తుంది. పాపభీతి, దయ కలిగి యుందురు. దాన ధర్మాలు చేయుదురు. అందరి అభిమానం పొందుతారు. బుధ, గురువారాలు బాగుండును.



మకరం: Capricorn (ఉత్తరాషాఢ –2,3,4, శ్రవణం, ధనిష్ఠ –1,2): వృత్తి వ్యాపారములు సామాన్యంగా ఉండు ను. విద్యుచ్ఛక్తి, టెలిఫోను,నిర్మాణ రంగం వారికి బాగుం డును. స్వయం కృషి వలన లాభాలు కలుగును. ప్రయా ణాలు వచ్చును. స్నేహితులతో జాగ్రత్తగా వ్యవహరిం చవలెను. ఆర్థిక ఇబ్బందికలిగిననూ, సకాలములో ధనం లభించును. అనాలోచిత ప్రయాణములు చేస్తారు. అష్టమ శని గలదు. శ్రీ విష్ణువును ,శ్రీవెంకటేశ్వరుని పూజించాలి. అపవాదులు, అపోహలు కలుగును.



కుంభం:Aquarius (ధనిష్ఠ–3,4, శతభిష, పూర్వాభాద్ర– 1,2,3

ఆరోగ్యము బాగుండును. స్త్రీ స్నేహం లభించును. వ్యవసాయ దారులకు స్వల్ప లాభం. వృత్తి, పాల, ఉత్పత్తుల, వస్త్ర వ్యాపారులకు లాభించును. బంధుమిత్రులతో కలహాలు వచ్చును. అధిక ధన వ్యయం కలుగును. అనవసర ప్రయాణాలు వచ్చును. శ్రీ సుబ్రమణ్యేశ్వరుని ఆరాధించుట మంచిది.



మీనం:Pisces (పూర్వాభాద్ర –4,

ఈ రాశి అన్ని రంగాల వారికి అనుకూలంగా ఉండును. విశేష ధనలాభం కలుగును. శుభకార్యాలు జరుగుతాయి. గ్రామాధికారం సిద్ధించును. ఆది, సోమ, మంగళ వారాలు అనుకూలము.

## ఆలయం

# గురువాయూర్... ఉన్నికన్నన్

*శ్రీకృష్ణ ఆలయాలకు ఉత్తరభారతం ఎంతో ప్రఖ్యాతి గాంచింది. కానీ, దక్షిణభారత దేశంలో కూడా అత్యంత విశిష్టమైన, ఎంతో చారిత్రక విశేషం కలిగిన శ్రీకృష్ణుడి ఆలయం ఉంది. అదే కేరళలోని గురువాయూర్. బాలకృష్ణుడి రూపంలో భక్తుల కొంగుబంగారంగా వెలుగొందుతోన్న ఈ చిన్ని కృష్ణుడిని దర్శించుకోవడానికి ఏటా లక్షల్లో భక్తులు వస్తుంటారు. ముఖ్యంగా అయ్యప్ప మాలధారణ ధరించిన స్వాములు శబరిమలై వెళ్లే సమయంలో కానీ, తిరుగు ప్రయాణంలో కానీ గురువాయూర్‌ను సందర్శించుకుంటూవుంటారు.*

కేరళలోని త్రిచూర్‌కు 30 కిలోమీటర్ల దూరంలో ఉన్న చారిత్రక బాలకృష్ణుడి ఆలయం గురువాయూర్. ఈ ఆలయంలో కొలువై ఉన్న స్వామిని కన్నన్, ఉన్నికృష్ణన్ (బాలకృష్ణుడు), ఉన్నికన్నన్, గురువాయురప్పన్ అనే పేర్లతో కొలుస్తుంటారు. తులసి మాలలతో, ముగ్ధ మనోహర రూపంతో అలరించే బాలగోపాలుడి రూపం మరే ఆలయంలోనూ మనం కాంచలేము. నాలుగు చేతు లలో పాంచజన్య శంఖం, సుదర్శన చక్రం, కౌమోదకం, పద్మాలయాలను ధరించి అద్భుతంగా వుంటుంది శ్రీకృష్ణుడి ముగ్ధమనోహర రూపం.

### కేరళ తిరుపతి..!

ఆంధ్రులకు తిరుపతిలాగానే, కేరళీయులకు గురువాయూరు శ్రీకృష్ణుడు ఆరాధ్యదైవం. భౌగోళికంగా కేరళ రాష్ట్రం పొడవుగా సొరకాయలాగ ఉండి, అరేబియా సముద్రతీరం అంచునే ఆనుకొని వుంది. రాష్ట్రానికి పూర్తిగా దక్షిణ కొసను త్రివేంద్రంలోని అనంత పద్మనాభస్వామి, ఉత్తరకొసను కాకపోయినా, సుమారు ఛాతి భాగంలో గురువాయూరు శ్రీ కృష్ణుడు వున్నారు. త్రివేంద్రానికి కొంచెం ఉత్తరంగా తీరానికి దూరంగా శబరిమలై అయ్యప్ప వున్నప్పటికి, శబరిమలై యొక్క ప్రాముఖ్యం ఈ మధ్య కాలంలో విస్తరించింది. పైగా శబరిమలై దర్శనం సంవత్సరంలోని కొన్ని రోజులకే పరిమితం. గురువాయూరు, త్రివేంద్రం కాక ఇంకా కేరళలో అంబళపురం, పట్టాంబి, కాలడి మొదలైన పుణ్యక్షేత్రాలున్నా, అవి స్థానికుల వరకే పరిమితం. ఆది శంకరాచార్యులవారి జన్మస్థలం గనుక, ప్రత్యేకమైన ఆసక్తివున్న కొందరు మాత్రం కాలడి దర్శిస్తుంటారు.

కేరళ సంప్రదాయ పద్ధతిలో నిర్మించిన గురువాయూర్ ఆలయం అతి ప్రాచీనమైన చరిత్ర కలిగినది. దేశం నలు మూలలనుంచి ఈ ఆలయాన్ని దర్శించేందుకు భక్తులు పెద్ద ఎత్తున తరలివస్తుంటారు. ఆది శంకరాచార్యుడు ఏర్పాటు చేసిన పూజా విధానాన్ని ఇప్పటికీ ఆచరించే ఈ ఆలయంలో నంబూదిరి వంశపారంపర్యంగా పూజాదికాలు జరుగు తుంటాయి.

గురువాయూర్ ఆలయంలో ప్రతి ఏడాది ఆఖరున 41 రోజులపాటు మండల ఉత్సవాన్ని వైభవంగా నిర్వహిస్తారు. రాత్రిసేవలో భాగంగా ఏనుగు అంబారీపై కృష్ణ విగ్రహాన్ని ఆలయం చుట్టూ ఊరేగింపుగా తిప్పే ఉత్సవం కన్నులపండువగా సాగుతుంది. ఈ సమయంలో స్వామివారిని దర్శించుకునే భక్తులు తమ కోర్కెల సాధనకోసం తులాభారం, అన్నదానం తదితర కార్యక్రమాలను నిర్వహిస్తుంటారు.

### ఆలయ చరిత్ర...

స్వామివారి విగ్రహాన్ని పాతాళం జనశిలతో నిర్మించినట్లు పూర్వీకులు చెబుతుంటారు. కృష్ణావతారం సమాప్తి అయ్యే కాలంలో శ్రీకృష్ణుడు తన సహచరుడైన ఉద్ధవునికి కృష్ణ విగ్రహాన్ని ఇచ్చి లోకకళ్యాణం కోసం ఈ విగ్రహాన్ని ఎక్కడైనా స్థాపించమని ఆజ్ఞాపించాడు. జలప్రళయం అనంతరం ఆ విగ్రహాన్ని వాయువు కాపాడి, దేవగురువు బృహస్పతికి అప్పగించాడు.

దేవ గురువైన బృహస్పతికి వాయువు సహాయంతో ఏర్పడిన ఈ ప్రాంతాన్ని గురువాయూర్‌గా, స్వామిని గురువాయురప్పగా కొలుస్తుంటారు. విష్ణువు అవతారమైన ఈ బాల గోపాలుడికి అర్చకులు శంఖాభిషేకం, అర్చనలను అత్యంత భక్తిశ్రద్ధలతో నిర్వహిస్తుంటారు.

వివిధ రకాల పుష్పాలతో, సకలాభరణాలతో స్వామిని అందంగా అలంకరిస్తారు. ఇదే రూపంలోనే దేవకీ వసుదేవులకు, కురుక్షేత్ర యుద్ధ సమయంలో అర్జునుడికి శ్రీకృష్ణుడు దర్శనమిచ్చినట్లు పురాణాలు చెబుతున్నాయి. ఇదిలా ఉంటే... గురువాయూర్ ఆలయంలో ప్రతి సంవత్సరం నవంబర్, డిసెంబర్ నెలల్లో ప్రముఖ సంగీత విద్వాంసులు చెంబై వైద్యనాథ భాగవతార్ పేరుమీద నిర్వహిస్తారు.

అలాగే ఫిబ్రవరి, మార్చి నెలల్లో పది రోజులపాటు అష్టమి రోహిణీ ఉత్సవాలను జరుపుతారు. ఆగస్ట్, సెప్టెంబర్ నెలల్లో ఓణం పండుగను ఈ ఆలయంలో కేరళవాసులు ఘనంగా జరుపుకుంటారు. అలాగే కృష్ణుడి ఆలయానికి దగ్గర్లోనే శ్రీ పార్థసారథి ఆలయం, వమ్మియూర్ శివాలయం కూడా దర్శనీయ క్షేత్రాలే.




# మన వైభవం గోమాత

**భారతీయతకు పరిపూర్ణమైన వైభవాన్ని తీసుకువచ్చింది గోవు. గోవు ఆవిర్భావానికి సంబంధించి ఎన్నో పురాణ గాథలు వున్నాయి. అవన్నీ కుహనావాదులకు పుక్కిటి పురాణాలుగా అనిపించినా వాస్తవిక జీవితంలో మాత్రం ఆవు చేసే మేలుని కాదనలేము. ఆవు పవిత్రత గురించి మాట్లాడే శక్తి సాధారణ మానవుడికి కొంత సాహసంతో కూడుకున్న విషయమే.**

భగవద్గీత ఎన్నిసార్లు చదివినా...చదివిన ప్రతిసారి కొత్తగా ఏదో ఒక విషయం అర్థమవుతుందో, అది పఠించిన ప్రతిసారి మన జీవితాన్ని ఇంకా ఇంకా సులభతరం చేస్తుందో అదే తీరులో గోవు గురించి ఆలోచించినా దాని గురించి పరిశోధన చేసినా మానవ మేధస్సుకు అందని ఎన్నో అద్భుతాలు బయటపడుతాయి. గోవు అనేది మతానికి

సంబంధించిన విషయం కాదు అది భారతీయత. ఆ భాధ్యతను హిందూ జాతి తన భుజాల పైన వేసుకోవడం వలన అది కేవలం హిందువులకు చెందిన పవిత్ర జంతువని ఒక టాగ్ తగిలించారు. గోవు కేవలం హిందువులకు మాత్రమే కాదు భారతదేశంలో పుట్టిన ప్రతి ప్రాణికి గోమాత, అంటే తల్లి లాంటిది.

తల్లి అయినా కేవలం కుటుంబ భారాన్ని మోసి నిన్ను పెంచి పెద్దవాడిని చేసి దేశానికి పనికి వచ్చే ప్రయోజకుడిగా తీర్చిదిద్దే భాధ్యతను తీసుకుంటుంది.



అయితే గోవు మాత్రం యావత్ భూమండలాన్ని లాలించి, పాలించి, పాలిచ్చే విశ్వమాతగా బాధ్యతను తీసుకుంటుంది. అలాంటి గోవును గౌరవించి పూజించడం మనందరి బాధ్యత. గోవు ప్రయోజనాలను గురించి మాట్లాడుకుంటూ, అది చేసే మేలును ఆర్థికపరమైన విషయాలతో లెక్కలు వేయడం ఒకింత అమాయకత్వమే అయినా అతి సాధారణ మానవులకోసం కొన్ని ప్రయోజనాలను గురించి చెబుతూ వస్తున్నారు.

అలా అయినా మారుతారని. దేశానికి వెన్నెముక పల్లెలు అక్కడ చేసే వ్యవసాయము. ఆ వెన్నెముకను విరగకొట్టడానికి ఆంగ్లేయులు పన్నిన కుట్రే గోవధ. గోవు భారత ఆర్థిక వ్యవస్థకు మూలస్తంభంగా నిలిచి మానవ మనగడకు కారణమైంది. అలాంటి గోసంపదను నాశనం చేస్తే కానీ భారతీయులు విదేశీయుల పక్షాన చేరరని కుహన నీతితో గోవులను వధించి దాన్ని ఆహారంగా మార్చుకున్నారు. గోవుతో మానసికంగా ఎంతగానో అనుబంధాన్ని పెట్టుకున్న భారతీయులు ఒక్కసారిగా ఆంగ్లేయుల కుట్రకు దిగాలు పడ్డారు. అధిక సంఖ్యాకులు గోవును దైవంగా పూజిస్తున్న భారత దేశంలో ఈ విపరీత చర్యలు కలకలాన్ని సృష్టించాయి. ఇదే విభజించు పాలించు అనే సూత్రానికి నాందిగా మారింది. హిందువులు పవిత్రంగా భావించే గోవును వధించడానికి మహమ్మదీయులను పురిగొలిపి మానసికంగా హిందూ మహ్మదీయ సోదర భావాన్ని

దెబ్బకొట్టారు. పలెల్లో ఒకరిపట్ల ఒకరికి యుద్ధభావాన్ని పురిగొల్పారు.

ఇదే మతకల్లోలాలకు దారితీసింది. అంతకు ముందు చరిత్రలో హిందు ముస్లీముల మధ్య జరిగిన కొట్లాటలు అంతటితో ముగిసిపోయేవి, అయితే



ఆంగ్లేయులు పెట్టిన చిచ్చుమాత్రం ప్రజల రక్తంలో చేరిపోయింది. భవిష్యత్తు తరాలపైన కూడా దాని ప్రభావం పడింది. గోవును అడ్డు పెట్టుకుని ఆనాడు ఆంగ్లేయులు మన దేశ వైభవాన్ని నాశనం చేయాలని పన్నాగాలు పన్నారు. నేడు మన దేశం విదేశీ పాలనలో లేనప్పటికినీ.. విదేశీ తీర్థం పుచ్చుకున్న వారుమాత్రం భారత మాత వైభవాన్ని, సౌరభాన్ని దెబ్బ తీసే సాహసం చేస్తున్నారు. ఇది ఎంతో ప్రమాదకరమైన పరిస్థితి. మన మధ్య మన లాగానే, మన దేశానికి ద్రోహాన్ని తలపెట్టేవారు వున్నారు. వీరి లక్ష్యం గోవును వధించడం కాదు, విశ్వాసాలను వధించడం. తద్వారా అల్లకల్లోలాన్ని సృష్టించడం. దేవాలయం లాంటి భారత దేశంలో అలజడిని సృష్టించి మనలను బలహీనులను చేయడమే ఈ కుట్రవెనుక వున్న ఆలోచనగా అనిపిస్తుంది. తింటానికి చాలా

వున్నాయి, కనీసపు ఇంగితాన్ని కోల్పోయి జీవిస్తున్నామనే ఎరుకను కలిగి వుండాల్సిన అవసరం ఎంతైనా వుంది.

మన ఎదుగుదల తిండి దగ్గరే ఆగిపోయిందంటే హాస్యాస్పదంగా వుంది. తినేవారు

తినవద్దనేవారి మధ్య వ్యత్యాసం అక్కడే తెలిసిపోతుంది. కొద్దిగా ఆలోచించండి, గోమాతను కాపాడటం అంటే భారతీయ వైభవాన్ని కాపాడుకోవడమే.

# వావ్!



## లై(క్)టర్

తెలివైన రైటర్‌కు కావాలి లైటర్...
తెల్లారిందంటే దమ్ము కొట్టాలిగా బ్రదర్...
తిండి లేకున్నా సిగరెట్ ఉంటే బెటర్...
తరుముకొచ్చే చీకటిని చీల్చే రైడర్...
తగరపు అందాలనద్ది తయారయిన ఫిగర్...
తారాస్థాయి ఖరీదులో... ఈఫిల్ టవర్...
తలుచుకుంటే అగ్గిని రప్పించేదే దాని పవర్...

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

